SREE

# MARUTTARATCHA[redacted]

An Original Dram[redacted]

In five Acts.

BY


**Sripada Lakshmipathi Sastry**

*Manager*

Sree Suryaraya Telugu Lexicon [redacted]

PITHAPURAM.





V. M. R. PRESS, PITHAPURAM.

1927.

శ్రీ

# మరుత్తరాట్చరిత్ర.

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు కార్యస్థాన ప్రధానపండితులును

వాసవవిజయాసహాయశూరచరిత్రాది నాటకకర్తయు

నగు

## శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రిచే



రచింపఁబడినది.

పీఠికాపురము.

అక్షయ పౌషమాసము.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాలయమున ముద్రితము.

కాపీరైటు.

వెల రు 0-10-0

# ఇందలిపాత్రలు.

**పురుషులు.**

సూత్రధారుఁడు } ప్రస్తావన.
మారిషుఁడు }

మరుత్తుఁడు—కథానాయకుఁడు. I, IV, V అంకములు.

,, పిచ్చివేషముతో II ,,

సంవర్తుఁడు—బృహస్పతితమ్ముఁడు. ,, మరుత్తునిగురువు. V అం.

,, పిచ్చియోగివేషముతో ,, ,,.

నారదుఁడు—I, V అం.

మహేంద్రుఁడు—III, V అం.

బృహస్పతి—మహేంద్రగురువు. III, V అం.

అగ్నిహోత్రుఁడు—మహేంద్రదూత. III అం.

అవీక్షితుఁడు—మరుత్తునితండ్రి. IV అం.

ఔర్వుఁడు—యోగికులపతి. IV అం.

వాసుకి—నాగకులపతి. IV అం.

విద్యాధరుఁడు—III అం.

విద్యాధరుఁడు—బృహస్పతిశిష్యుఁడు. V అం.

గంధర్వుఁడు—III అం.

రాజభటులు—(నలుగురు) II అం.

తలారి—II అం.

ద్వారపాలుఁడు—III అం.

వృద్ధముని—IV అం.

రాజభృత్యుఁడు—IV అం.

యోగులు—(బ్రాహ్మణులు) IV అం.

నాగులు—(సర్పజాతివారు) IV అం.

**స్త్రీలు.**

వీరమహాదేవి—మరుత్తుని పితామహి. IV అం.

భామిని—మరుత్తునితల్లి. IV అం.

## తప్పొప్పుల పట్టిక.

——:0:——

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| ౫ | వాజపేయాజి | వాజపేయయాజి |
| ౯ | ఉద్దంద | ఉద్దండ |
| ౧౭ | నా— | మ— |
| ౧౯ | మ— | — |
| ౧౫ | ఆశ్వినులు | ఆశ్వినేయులు |
| ౮ | ఆశ్వినులు | ఆశ్వినేయులు |
| ౯ | నైయంత | నైజయంత |
| ౧౩ | నిర్వ | నిర్ణ |
| ౩ | లాలసు | లాంసు |
| ౧౭ | గర్జి | గర్జించి |
| ౧౩ | చంపితి | చంపించితి |
| ౩ | నిష్క | నిష్క్రి |
| ౧ | నాగుముల | నాగుల |
| ౧౮ | సిలచి | నిలిచి |
| ౧౦ | సంగ్త | సంవర్త |
| ౨ | నీదయయుండిన | |
| ౧౮ | సం—దేవరాజ | మరు—దేవరాజ |
| ౩ | మంత్రిముని కధీను | మంత్రిమునకు నధీను |
| ౧౫ | ఇదింత | ఇదంత |
| ౧౩ | పెగ్గలు | పగ్గలు |
| ,, | బ్రెల్చెద బుగ్గిగ | భస్మము సేసెద |
| ౧ | భిమరనూ! నీ | భిదురమా! యేమి! నీ |
| ౨౩ | కొనుము | కొనము |
| ౭ | ఎవరు బిలిచి | ఎవరు పిలిచి |



శ్రీ




# మరుత్తరాట్చరిత్ర.

## నాంది.

శ్రీమత్స్వర్గపురీవిభుత్వజనితస్ఫీతాభిమానాంధుఁడై
భూమిం బుట్టెడువార లెంత యను దుర్బుద్ధిన్ సురాధ్యక్షుఁడు దా
భీమం బౌనతివృష్టులం గురియుచుం బీడింప గోగోపక
క్షేమార్థంబుగఁ గొండ యెత్తినమహాజిష్ణున్ మదిం గొల్చెదన్.

మఱియు,

మ. మునివాసంబునఁ బుట్టి విద్య లఖిలంబుల్ నేర్చి దుర్వారరా
క్షసజీమూతమరుత్తులై కుశలవాఖ్యాతిన్ స్వధర్మార్థమై
జనకుం బోరను దాఁకినట్టిసుతులన్ శౌర్యాఢ్యులం జూచి తా
మనమం దెంతయుసంతసించురఘురామక్షోణీంద్రుఁ డోమున్ మిమున్.

(సూత్రధారుఁడు ప్రవేశించి పైకిఁ జూచి తలయూఁచి)

అశేషవిద్యావిశేషభూషణాయమానపండితమండలీవిరాజిత పీఠికాపురమహారాజసభామండనాయమానమహాజనులారా! ఏమి యాజ్ఞాపించుచున్నారు? ఆఁ! ఆఁ! తెలిసినది తెలిసినది. మొన్న నభినయించిన యసహాయశూరచరిత్రయందలి మరుత్తజననకథ, మాకు మరుత్తరాట్చరిత్రనాటకదర్శనమునందుఁ

కుతూహలము గలిగించినది. నేఁడు మరుత్తరాట్చరిత్రనాటకము ప్రదర్శింపు మనుచున్నారా? చిత్రము. చిత్రము. మీయాజ్ఞ శిరసావహింతు.

(నేపథ్యమువైపునకుఁ జూచి)

బావా! మారిషా! పెద్ద లాజ్ఞాపించినదే చాలు నని వారికి ముందు మాట యిచ్చినాను. నీ వింకను రావైతివి. ఏమి సేయవలయునో నాకు తోఁచుట లేదు.

మారిషుఁడు—(ప్రవేశించి) బావా! ఇదిగో! వచ్చినాను. ఇంతలోనే యంతతొందరపడెదవేల? నీ వంతసందేహపడ నేల? ఆంజనేయునివలె నీ కెంతప్రజ్ఞ యున్నదో నీ వెఱుంగక యిట్లు సందేహించుచున్నావు.

సూ—మారిషా! బావా! ఏమి యంతధైర్యముగా మాటలాడుచున్నావు? అదిగో! ఆమహారాజసభ చూడుము. అటఁ గాణాదనైయాయికవైశేషికపూర్వోత్తరమీమాంసానిష్ణాతులు, ఇట నవరసపోషణవిచక్షణధిషణాభూషణు లగుమహాకవిభూషణులు, అదిగో! అప్రక్కను కవితాఫక్కిని ఉభయభాషాకవిమిత్రమిత్రులును బహుభాషాపాండితీప్రకాశమాన సర్వతంత్ర స్వతంత్ర సర్వతోముఖానేకచిత్రవిచిత్రాపూర్వరచనాంచితలౌకిక వేదోపనిషన్నిర్మాత లగు కవిబ్రహ్మలు, అదిగో! కవిబుధగురుమంత్రిమిత్రబాంధవమధ్యంబున సర్వవిషయగ్రహణధారణపారీణాపారబుద్ధివిశేషవిరాజమానుఁ డగు శ్రీసూర్యరాయమహారాజప్రకాశించు నీసభలోనా నీధైర్యస్థైర్యములు?

మా—బావా! దోషరాశిలోఁగూడ గుణలేశముల గ్రహింప నెంచు నీసరసమహాజనసభలోఁ గాక గుణములనుగూడ దోషములుగాఁ బరిణమింపఁజేయుఁ జూచువిరసులసభలోనా నాస్థైర్యస్థైర్యములు? సందేహింపకుము. అసహాయశూరచరితాభినయము చూచి సంతసించియేగదా నేఁడు మరుత్తరాట్చరిత్ర యభినయింపు మని సభ్యు లాజ్ఞాపించిరి?

సూ—ఔనుగాని బావా! మరుత్తరాట్చరిత్ర పూర్వ మేకవియో ప్రబంధముగా రచించెనుగాఁబోలునే.

మా—శ్రీనాథమహాకవి రచించినట్లున్నది గాని గ్రంథము నేఁటివఱకుఁ గాన రాదయ్యె.

సూ—ఈకథ ప్రాచీనగ్రంథములలో నెక్క డెక్కడ నున్నది? నీవు బహుగ్రంథదర్శివు. సవిశేషముగాఁ జెప్పుము.

మా—బావా! నీకుమాత్రము తెలియదా? ఐతరేయబ్రాహ్మణమున అతిసంగ్రహముగా నున్నది. భారతమార్కండేయపురాణములలో భిన్నభిన్నరీతుల విపులీకృతంబై యున్నది.

సూ—బావా! అవి శ్రవ్యప్రబంధములు గదా! ప్రకృతము మనకు దృశ్యప్రబంధము గావలయును. ఆంధ్రమున దృశ్యప్రబంధముగా నెవ్వరైన రచించినారా?

మా—బావా! అంతయుఁ గ్రొత్తగా నడుగుచున్నావేమి? వినుము.

ఉ. శ్రీపదవంశభూషణుఁడు వ◆శీకృతభాష జయంతి రామయా
ర్యోపనియామకత్వమున ◆ నుండెనువాఁ డలపీఠికాపురీ
భూపతి సూర్యరాయపరి◆పూర్ణనిఘంటుకృదగ్రగణ్యు ల
క్ష్మీపతిశాస్త్రి నాటకము◆సేసె మరుత్తమహాచరిత్రమున్.

సూ—వాసవవిజయానసహాయశూరచరితలు రచించినయాతఁడేకాఁడా ? ఆతని నే నెఱుంగుదు. ఆతఁడును ఆతనిసోదరులునుగూడ విద్వత్కవులే! ఆతనితండ్రిగారు వేదశాస్త్రశ్రౌతములయందు గట్టివారు. ఉభయభాషాకవిత్వము చెప్పెడివారు. ఆతనిమాతామహుఁడు వాజపేయాజి పాపయ్యసోమయాజిగారు, అశ్వమేధాంత మపరిమితముగాఁ జేయించు శక్తిగల మహాశ్రౌతి. సాక్షా దాశ్వలాయనుఁడే యని యెందఱో ప్రశంసించుట నేను విన్నాను.

మా—బావా! సరేకాని, ఆయన యీనాటకము రచించినట్టుమాత్రము నీ వెఱుఁగవా ?

సూ—ఇప్పు డంతయు జ్ఞప్తికి వచ్చినది. వారిపూర్వులవేదవాసనాబలముచేతనే యీకవి కీయాగగాథ ప్రకృతలోకానుసంధానముగా నాటకముగ రచింప బుద్ధిపుట్టెనేమో అని యనుకొంటిమి గదా!

మా—బావా! నీ కొక్కక్కపుడు సభాకంపముతోపాటు బుద్ధికి పంకముగూడఁ బట్టుచుండునా యేమి ?

సూ—బావా! నీ వన్నట్లు సభాసదులఁ జూడఁగానే మొదట ఒడలికిఁ గంపము పుట్టినట్టే బుద్ధికి పంకము పట్టినమాట నిజమే. నీవు సరి యోయి. నీ కిట్టికంపములు పంకములు లేవు. సాహసవంతుఁడవు. ధైర్యవంతుఁడవు. నీ కున్నధైర్యసాహసములు నాకే యున్నచో ఎంతపని చేసియుందును!

మా—దాని కేమి ? ఎవరియదృష్టము వారిది.

సూ—బావా! నీ కెంతధైర్యసాహసము లున్నను పూర్వసంప్రదాయము నతిక్రమించువాఁడవు కావు. కావున మరుత్తమహారా

జ్ఞయాగ మాచరించిన వసంతకాలము వర్ణింపుము. పెద్దపెద్ద నలతో సభాసదులకు వినువు పుట్టింపకుము. ఇది ప్రాచీనకాలము గాదు. ఇరువదవశతాబ్దిలోఁ బాదము గడచినకాలము. అందులో ఇది నాగరకులసభసుమీ !

మా.—బావా ! ఒక్కతేటగీతి. స్వభావోక్తి. విను.

తే. పుష్పచమకంబు లాసవ • పూర్ణ మయ్యె
మధుపబృందంబు దేహంబు • మఱచియుండె
భూమిఁ బరపుష్టవర్గంబె • పౌగరు నొందె
జాతివిద్వేషమున కిది • సమయ మయ్యె.

(తెరలో) ఔనౌను. జాతివిద్వేషమున కిది సమయ మగుట నిజమే. బృహస్పతి నేఁడు తా నమర్త్యనాథున కాచార్యుఁ డయ్యెనఁట. మర్త్యజాతివాఁడ నగునాచే యాగము సేయింపఁడఁట.

సూ.—బావా ! మారిషా ! వసంతము జాజిపూలకు ద్వేషసమయమని నీవు స్వభావోక్తిగా వర్ణించినావు. కాని జాతులకు—మర్త్యజాతికి అమర్త్యజాతికి—ద్వేష మనుచు నెవరో యేదో యనుచున్నారు. ఏమిది ?

మా.—బావా ! మఱేమియు లేదు. బృహస్పతినిరాకృతుఁడై నమరుత్తమహారాజువేషము ధరించి పెద్దబావ వచ్చుచున్నాఁడు.

సూ.—అబ్బా ! అప్పుడే మాయన్న వేషము వేసికొని వచ్చినాఁడే. మనముగూడఁ గావలసినవేషములు ధరింతము. రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---



శ్రీ

# మరుత్తరాట్చరిత్ర.



## ప్రథమాంకము.

మరుత్తుఁడు—(ప్రవేశించి) ఔనౌను. జాతివిద్వేషముల కిది సమయ మయ్యె ననుట నిజమే. మర్త్యజాతియం దమర్త్యజాతికి ద్వేషము పుట్టినది. నేను మర్త్యజాతివాఁడ నగుటచే మదీయ యాగోపదర్శనంబును దా నంగీకరింపఁడఁట. నేఁడు తా నమర్త్యనాథున కాచార్యుఁ డయ్యెనఁట. నేను మధ్యమలోకవాసినఁట! తా మూర్ధ్వలోకవాసు లఁట!—మధ్యమలోకవాసులగుమానవులు మహాసంభారంబులు సంపాదించి యాగంబుల సాజ్యవపాద్రవ్యంబుల నిచ్చుట యొక్కయేఁడాది మానిరేని దేవలోకంబున దుర్భిక్షంబు తప్పదు. అప్పు డూర్ధ్వలోకవాససౌఖ్యము దెలియఁ గలదు. కానిమ్ము. మేఁకలవంటియీమానవులు మేదినిలో నేక్షోభంబులు లేకుండఁగ నుభయతారకముగా మన్నదిగదా యని యూహించి ప్రాప్తసంప్రదాయము ననుసరించుచు మర్యాదతోఁ గాలక్షేపము సేయుచున్నారు. మా మానవులు తిరుగఁబడిరేని లోకము లన్నియుఁ దిరుగఁబడవల

సినదే—అప్పుగొన్నవాఁడు మరలఁ దీర్పవలసియున్నట్టు మన మిచ్చుహవిర్భాగంబులు గొన్నందులకుఁ బ్రతిఫలముగ స్వా రాజ్యసౌఖ్య మీయక వారికిఁ దప్పదు గదా! తల్లాభాశయుఁ, జిరంతనాభ్యాసము నితోధికంబుగా వారికి హావిర్భాగంబు లిచ్చుటకే మనలఁ బ్రేరించుచున్నవి. వాసవుఁడు మహేం ద్రపదవి నొందియు మానవాధిపతి నైననాయభివృద్ధి సూడ లేక మదీయకులగురు వగుబృహస్పతిని మదీయయాగోపదర్శ సేయవల దనె నఁట. దానికి నిమిత్తంబు మర్త్యామర్త్యజాతిభేద మని పలికె నఁట. హా! ఏమి! అదృష్టఫలకం బగుయాగా చరణంబుననే అందును మదీయయాగోపదర్శనంబుననే వారి కీ జాతిభేదము అడ్డువచ్చినదా? మొన్నటి దేవదానవయుద్ధమున మానవసాహాయ్యము గోరినప్పు డీజాతిభేదము మఱచినారు కాఁబోలు. మఱపురానియామహాయుద్ధమున మానవసాహా య్య మందకున్న నీపాటికీదేవరాజు దానవదాసుఁడు గావలసిన వాఁడేగదా! నే నన నేల? చతుర్దశభువనంబులు దీనికి సాక్షులే. సర్వభువనసంచారి యగునారదుఁ డెఱుఁగఁడా! ఎన్నఁటికి నైన వాని కీనిజము దెలిసినఁ జాలు. ఆతనివంటివారు వినిపోవుదు రనికాఁబోలు బృహస్పతి సభలో నాయాగోపదర్శననిరాకణం బు ప్రసంగింపక నన్నొంటరిగాఁ బిలిచి చెప్పినాఁడు. ఇది యాత్మావమానకారణము గాన నే నొరులతోఁ జెప్పకొన నని వా రూహించియుందురు. సత్యమే. ఇది యితరులతో నెట్లు చె ప్పకొందును. మనమునందలికోపోద్రేకంబునను నిరుత్సాహం బునను నవశంబుగాఁ బైకి వచ్చునామాట లెవరును వినలేదు గదా! (తలయెత్తిచూచి) నారదమహర్షి యిక్కడనే యు

న్నాఁడే! మనమున నుదయించిన కోపోద్రేకాభిమానంబుల స్తబ్ధీభూతంబులయిన సర్వేంద్రియంబులు విషయగ్రహణశూన్యము లయ్యెఁగాఁబోలు. నారదమహర్షిహరిభజనధ్వని, వీణాస్వానంబు, తాళపుఁజిప్పలచప్పుడు నాకు వినఁబడనే లేదు.

(నారదుఁడు ప్రవేశించును.)

మరు—మర్యాదానుసారంబున నమస్కారమైనఁ జేయుదునుగాక! (నమస్కరించును.) నారదమహర్షీ! ప్రణామంబు లాచరింతును. కార్యాంతరవిచారాయత్తచిత్తుండనై భవదీయాగమనంబు గుర్తింపని మర్యాదాతిక్రమణదోషంబునకు నేను క్షంతవ్యుఁడను.

నారదుఁడు—మరుత్తమహారాజా! మనోభీష్టసిద్ధిరస్తు. మర్యాదాతిక్రమణ మే మున్నది? కొంతకాలమునుండి పాకశాసనుఁడు పాడినదిపాటగాను, ఆడినదియాటగాను నున్నది. ఏనాఁటికైన నిజము గ్రహించి మనంబున నింతమహోద్రేకంబు నొందిన మానవరత్నాసక్తుఁ డీమానవులలో లభించునా యని చింతించునా? ఇది మహానందసంధాయకమే కదా! మానవరత్నమునకై మనంబున మహోద్రేకముతో నాలోచించువానికి మనోభీష్టంబు నెఱవేఱకుండునా?

మరు—నీదయావిశేషము.

నార—నీ కోరిదయ యెందులకయ్యా! మహేంద్రాదులకుఁగూడ నీదయ కావలసివచ్చుట నే నెఱుఁగనివాఁడనుగాను. నీవనుకొనినట్లు నేనే కాదు చతుర్దశభువనంబులుగూడ నెఱుఁగును.

ఉ. మొన్నటిఘోరయుద్ధమున ♦ ముందట డీకొనువార లెల్ల తా
పన్నత నొంద నిండ్రకర♦వజ్రము భీతి వడంక దేవతల్
ఖిన్నతనొంది నిన్ దలఁపఁ ♦ గిన్నరముఖ్యులు సన్నుతింప నా
పన్నుఁడవై సురారిజన♦సంఘము ద్రుంపవె యొక్కకోలతోన్.

తే. నీవు రణరంగమున వైరి♦నికర మెల్లఁ
ద్రుంపకుండిన దేవతా♦ద్రోహియొద్ద
దాసభావంబు సలుపుచు ♦ దైన్య మొంది
యుందు రీసరి కాసుర ♦ లూహసేయ.

మరుత్తమహారాజా! భూమండలాధిపా! యుద్దండభుజదండ చండతరపరాక్రమదండితవైరిమండలా!

క. చండత రాక్షసబృందము
ఖండించితి దేవతాళిఁ ♦ గాపాడితి వా
ఖండలుగుండెలు కుదురుగ
నుండె న్నీవండ నుండ ♦ యుద్ధావనిలోన్.

అట్టినిన్నుఁ జూచి యాఖండలుం డసహానపరుట యతినింద్యంబు. నీపై వానికిఁ గోపంబు గలుగుట నాకొక్కప్పుడు పొడ సట్టినది. అది క్రమక్రమముగా దీర్ఘక్రోధములోనికి దిగియుండును.

మరు—నారదమహర్షీ!

తే. దేవవిభునకుఁ గ్రోధంబు ♦ దీర్ఘమయిన
సరకుసేయను కులగురు♦వరునిమనము
కోప మొందుట యాగంబు ♦ కూలిపోవు
టరయు దరిలేనిదుఃఖంబు ♦ పొరలు మదిని.

తే. గురువు నా నిహాపరములఁ ♦ గూర్చువాఁడు
గురువు దైవంబుకంటెను ♦ గురుతరుండు
గురునిమదిలోనఁ గోపంబు ♦ గూడెనేని
కావ సామర్థ్య మేరికిఁ ♦ గలుగుఁ జెపుమ!

నారదా!

ఉ. ఈసున నామహేంద్రుఁడు సహింపక దేవపురోహితాత్మలో
నీసు జనింపఁ జేసె నమ♦రేజ్యుఁడు మత్కులయాజకత్వముం
జేసిన గౌరవంబునకుఁ ♦ జేకుఱు హాని యటంచు నెంచె నా
చేసినతప్పు లేదు చెడె ♦ సిద్ధముచేసినయాగ మంతయున్.

తే. యజ్ఞసంభారముల నెల్ల ♦ నాయితంబు
సేయ నియమించి తుది కిట్టు ♦ సేసె గురుఁడు
గురుఁడు దూరీకరించిన♦పరమపతితుఁ
డితఁ డనిపల్కువారి కే ♦ నేమి సెపుదు?

నార—మరుత్తమహారాజా! నీ వంతఖేదపడ నక్కఱ లేదు. నిలుకడ మీఁద నిజ మెల్లరకుఁ దెలియదా? నిజమెఱిఁగినవారు నిన్నేల నిందింతురు?

మరు—మహర్షీ! ఒక రినుటమాట యటుండనిమ్ము.

ఉ. ఎందుల కిట్టిజన్మము సు♦రేజ్యతిరస్కృతిపాత్రమంచు నా
యందున నా కె రోఁత యుద♦యం బగు నక్కట! ముగ్ధబుద్ధినై
కొందితి నిన్ను దైవగతిఁ ♦ జెప్పుము నాకుఁ దరించుసాధనం
బందుము వందనంబులు మ♦హర్షివరా! సకలజ్ఞ! నారదా!

నార—మరుత్తా! దివ్యమైనసాధనం బొకటి కలదు. ఎంతకాలమునుం డియో దివస్పతిబృహస్పతులగర్వభంగంబు గావింప సమర్థుఁ డగువానికిఁ జెప్పవలయు నని యున్నది. తగినవాఁడు లభింప

కుంచుటచే నానోటనుండి వెలువడకుండ నాఁపినాను. నేను గ లహాశనంబునఁ గడుపునిండించుకొనువాఁడ నయ్యు దయాదాక్షిణ్యశూన్యు లగుదానవులకు వాక్సాహాయ్య మైనఁ జేయ నొల్ల. అదిగాక ఆసాధనంబుగూడ అమరవిరోధుల కుపయోగించునది గాదు. దేవజాతియందు భక్తి గలిగిననీబోఁటివానికి దివస్పతిబృహస్పతులగర్వభంగము సేయఁ దలంపు గలిగెనేని యిదియొక యమోఘసాధనంబు.

మరు—నారదమహర్షీ! దేవజాతియందును దేవతానాథునియందును దేవతాగురువునందును గూడ నాకు పరమభక్తి గలదు. వారిఁ బరాభవించుట నాకభిలషితము గాదు. వారికై యాగ మాచరించి వారిని హవిర్భాగంబుల సంతృప్తులఁ గావించి నా యభీప్సితంబులు వడయుటయే నాయభీష్టము.

నార—దాన మహేంద్రుని మించినవాఁడ వగుదువు. కావుననే కదా యింద్రుఁడు నీయెడల నీర్ష్యాళు వయ్యె.

మరు—దానికి నే నేమి సేయుదు.

తే. అంత యింతయొ యభివృద్ధి • నందునట్టి
పరునిఁ జూచిన నసహాస•పడెడువార
లుందు రనుభీతి నభివృద్ధి • నొంద కందె
సహజ మున్నతపదకాంక్ష • సాధ్య మేని.

నార—నీకు సాధ్యముకాని దే మున్న దయ్యా! నీయాగంబు నిరాక్షేపంబుగా నిర్వర్తించుమహానుభావుఁ డొకఁడు గలఁడు. అతఁడు బృహస్పతినిఁ దలఁదన్నువాఁడు.

మరు—నారదా! నాగురువునకు నాయెడఁ గారణాంతరంబునఁ గోపంబు గలిగినను గురునింద సహింప నోపను. సురాచార్యుని

దలఁదన్నవా రుందురే. అంతమాట నే విన నొల్ల. మా కులయాజకవర్గము వీడి యన్యుల యాజకులుగా వఱించుటకైన నా మనంబు హర్షింపదు.

నార—నీ కట్టిగురుభక్తి యున్నదిగనుకనే యింతయభివృద్ధిలోనికి వచ్చినావు. నిజముగా బృహస్పతిని దలఁదన్నువాఁడే కలఁడు. అతఁడును భవదీయకులయాజకవర్గములోనివాఁడే.

మరు—నారదా! ఎవ రామహానుభావుఁడు!

నా—బృహస్పతియనుజుండగు సంవర్తు నీ వెఱుంగవా?

మరు—నేను వానిదర్శనము సేయలేదు గాని వానిపేరు వింటిని. అతఁడు ఏకారణమునవో గాని స్వర్గమును వీడి ఏలోకమునవో తపస్సు చేయుచున్నాఁడని విని యున్నాను.

నా—ఏలోకమునవో యన నేల? మీలోకముననే యున్నాఁడు.

మ—(సంతోషముతో) ఏక్షేత్రమునఁ దపస్సు చేయుచున్నాఁడో.

నా—భుక్తిముక్తిదాయిని యగు కాశికాపురిలో సంచరించుచున్నవాఁడు.

మ—అతఁడు స్వర్గము వీడి భూలోకసంచారము నవలంబించుటకుఁ గారణ మేమి?

నా—ఏమి చెప్పను— బృహస్పతిధర్మేతరమార్గప్రవర్తనమే దానికిఁ గారణంబు.

మ—బృహస్పతి యధర్మప్రవర్తనము సేయునా? ఇతరులప్రోత్సాహమున నట్లు సంచరించెనేమో!

నా—కాదు కాదు. నీగురుభక్తి నీ కట్లు తోఁపించుచున్నది. కాని బృహస్పతి తా నధర్మమార్గమునఁ జరించుటయేగాక దివస్పతి నిగూడ ధర్మేతరమార్గమునఁ బ్రవర్తింపఁజేసినాఁడు.

మ—మీబోంట్లవారిమాట నేను విశ్వసింపక తప్పదు గదా! ఏమి ఆయధర్మము?

నా—తనయనుజుండైనసంవర్తునికి వంశపరంపరాలబ్ధ మగుదాయ మీయక వాని నింటనుండి వెడలఁగొట్టె. అంతతోఁ బోక మఱి యు మాఱుమాటాడినచో దేవవిభునితోఁ జెప్పి దేవలోకము నుండి వెడలఁ గొట్టించెద ననియె.

మ—అహహా! ఏమి ధనలోభము!

ఉ. బంధులు మిత్రులాప్తులును ♦ భ్రాతకు సాటికి రారు భ్రాతృసం
బంధము జన్మతోభవము ♦ పైతృకవిత్తవిభాగవేళలో
భ్రాంధత భ్రాత శత్రు వగు ♦ హా! ధనలోభ మ దెంతదుష్టమో
బంధము ద్రెంపివైచురిపు♦భావము పెంచెను నెట్టివారికిన్.

నా—మరుత్తా! ఎంతనీతివేత్తయైనను విత్తవిషయమున నుత్తమేతరుం డగు. అది యటుండనిమ్ము.

తే. సోదరోద్గతవాదంబు ♦ సొమ్ముతోనె
పోదు మనమునఁ జలమును ♦ బొందఁజేసి
పొసఁగనీయదు భ్రాతలఁ ♦ బొత్తునొంద
సహజశత్రువు లైరిగా ♦ సహజు లిపుడు.

నా—సత్యమే. సత్యమే.

మ—మహేంద్రుఁ డిది మంచిది కాదని బృహస్పతితోఁ జెప్పలేదా?

నా—సంవర్తుఁడు సభాముఖంబుననే తనకు దాయభాగ మిప్పింపు మని సహస్రాక్షు నభ్యర్థింప బృహస్పతివశీకృతమనస్కుఁ డగుసహస్రాక్షుఁ డంధప్రాయుఁడై జ్యేష్ఠునకే గాని నీకు భాగములేదు పొమ్మనెను. అంగిరసకనిష్ఠుఁ డిది యధర్మ మనియు సకల శ్రుతిస్మృతివిరుద్ధ మనియు వాదింప నేదియు వినిపించుకొనక

పై పెత్తు గట్టిగ మాటలాడినచో దేవలోకభ్రష్టుని గావించె ద నని బెదరించెను.

మ—సుధర్మామంటపవాసు లందఱు నూరకుండిరే ?

నా—ఏమి సేయుదురు ? మాఱుమాటాడినచో మహేంద్రబృహస్పతులకు విరోధు లగుదురు. అట్టిసభలో నిలఁబడుటకంటెను అట్టివానిరాజ్యమున నుండుటకంటెను ఎక్కడకేనియుఁ బోవుట యుత్తమోత్తమం బని దేవలోకంబు త్యజించి భూలోకంబునకు వచ్చినాఁడు. భూలోకముగూడ మహేంద్రునిసామ్రాజ్యములో నొకభాగమే యగుటచేత ప్రకటజీవనంబున జీవింప నొల్లక యున్మత్తునివలె సంచరించుచు ప్రచ్ఛన్నజీవనంబున జీవించుచున్నాఁడు.

మ—అభిమానధనుల కట్టులే యుండును గదా !

నా—కావున నతని నీవు యాజకునిగా వరించితివేని దివస్పతిబృహస్పతులయందలిదీర్ఘక్రోధంబున నైన నీచే యాగము చేయించును.

మ—పాపము ! ఆమహానుభావునకు మహేంద్రకృతపరాభవమునను మహాక్రోధంబునను నిజముగా మతివైకల్యము కలిగ నేమో!

నా—లేదు. లేదు. యోగసిద్ధిచే స్వస్వరూపజ్ఞాని యగుటచేఁ ధైర్యస్థైర్యంబుల నవలంబించి మనోవైకల్యంబు గలుగకుండఁగాఁ జేసికొని నిజస్థితి పరుల కెఱుంగరాకుండ నున్మత్తుని వలె సంచరించుచున్నవాఁడు.

మ—యోగశక్తిచేఁ దనకు మొదటఁ గలిగిన క్రోధాదుల నిర్మూలించి యాత్మారాముఁడై యుండెనేమో ! నేఁడు వెనుకటికసి దీర్ప నంగీకరించునా ?

నా—కామక్రోధాదుల నిర్మూలింప నెవరితరము ?

తే. ఎట్టియోగసిద్ధున కైన • నెట్టితపసి
కైనఁ గని దీర్ఘ నవకాశ • మబ్బ నేని
యణఁచిపెట్టినక్రోధ • మాయనలునట్టు
లఖిలభువనంబులను గాల్ప • నదియె రేఁగు.

వానిక్రోధానలం బెన్నఁటికి నాఱిపోదు. దానికి నీ వనిలుండవగుదువు. తత్క్రోధాగ్నిజ్వాలల దివస్పతిబృహస్పతులగర్వంబు భస్మీభూతం బగును.

మ—నారదమహర్షీ ! భవదాజ్ఞానుసారంబుగఁ బ్రవర్తించువాఁడ. నా మనవి యొకటి కలదు. చిత్తగింపుము.

నా—ఏమది ?

మ—బహుజనావాసం బగుకాశికాపురంబున నున్మత్తు లెందఱో సంచరించుచుందురుగదా! కొందఱు యోగసిద్ధులు నున్మత్తులవలె సంచరించుచుందురు. వారిలో నామహానుభావు నే నెట్లు గుర్తింపఁగలుగుదునో సెలవిమ్ము.

నా—అది గూఢముగా నుంపవలసిన విషయము. కాత్యాయనుమేయ యత్నుండవు కావలయును జుమీ !

మ—రహస్యముగా నుపదేశింపుము. (దగ్గఱఁ జేరును.)

నా—(మరుత్తునిచెవిలో ఏదియో చెప్పును.)

మ—(సంతోషసంభ్రమములతో) చిత్తము మునీశ్వరా ! ధన్యుఁడనైతిని. భవదనుగ్రహంబున నీక్షణమే కాశికాపురి కేగెదను. కాశికాపురిలో నున్మత్తులను బాధింపకుండ రాజాజ్ఞ కలదు గావున నేనును ఉన్మత్తవేషముననే సంచరింతును. నాకుఁ గార్యసిద్ధి గలుగ నాశీర్వదింపుము.

నా—మరుత్త మహారాజా !

తే. సుపథమునఁ బోయి యోగీశు • నుప్రసన్నుఁ
జేసికొని వానికృపచేతఁ • జిత్తమందుఁ
దలఁచుయజ్ఞంబు గావించి • ధన్యుఁ డగుము
స్వర్గనాథుఁడు గురుఁడును • వశులు గాఁగ.

నేను కనుపెట్టి చూచుచుందు. ఈలోపున నాకేదేని అల్పాహారమో అధికాహారమో దొరకకుండఁగ నింతకార్యము తుద ముట్టునా ? నేను పోవలయును. నీ వీదారినే కాశికాపురి కేగుము.

మ—చిత్తము.

(నిష్క్రమింతురు.)





శ్రీ

# మరుత్తరాట్చరిత్ర.

## ద్వితీయాంకము.

(కాశికాపురవీధిలో ఉన్మత్తవేషధారి యగు మరుత్తుఁడు ప్రవేశించును.)

మరు — రాత్రి యంతయు వెదకినను దిక్కుమాలినశవ మొక్కటి యైనఁ గానరాదుగదా ! వరణానది మొదలు అసీనదీపర్యంతము గల పంచక్రోశమితం బగువారాణసీపురం బంతయుఁ బ్రతివీథిని సంచరించితిని. అదిగో ! చుక్క పొడిచినది. రాత్రి యామమైన లేదు. అదిగో ! పురవాసులు గంగాస్నానార్థ మరుగుచున్నారు. కొందఱు గంగలో మునుఁగుచు హర హర మహాదేవ శంభో అని యుచ్చైర్నాదములు చేయుచున్నారు. భం మహాదేవ శంభో యను భక్తజననినదంబు రోదసీకుహరంబునఁ బ్రతిధ్వనించుచున్నది. ఆప్రతిధ్వానంబు విని కొందఱు ఉలికిపడి లేచి స్నానసమయ మయినది యని వడిగా గంగాతీరంబునకుఁ బరువెత్తుచున్నారు. నా కింక నవకాశ మెక్కువ లేదు. ఒక్కదిక్కుమాలినపీనుఁగు దుర్లభ మయ్యె. ఈప్రాం

బున నున్మత్తుల బాధింపరా దని కాశికాపురాధిపతి శాసించుట చేత నున్మత్త వేషధారి నగునన్ను నున్మత్తుఁ డనుకొని యెవరును బాధింపరు గాని దిక్కుమాలినశవము కన్పడినచో తన్నిర్హరణార్థ మేర్పడినచండాలు రాశవమును బలవంతముగా లాఁగికొని శ్మశానమునకుఁ గొనిపోవుదురు. దానిచే నాకార్యమునకు విఘ్న మగును. ఇంతకును దిక్కులేనిశవము దొరకలేదే. ఏమి సేయుదు? అదిగో! స్నానార్థ మాసందులోనుండి వచ్చువారు గూడ దిక్కుమాలినశవ మనుచున్నా రేమది? నామాట ప్రతిఫలించి యట్లు వినిపించెనో లేదా నా కదేదృష్టి యుండుట చేత నా కట్లనిపించెనో అయినను పొంచియుండి వినెదనుగాక! (పొంచియుండి విని) అమ్మయ్య! బ్రతికినాను. ఆసందులో నొకశవ మున్నదనియు వారు స్నానముచేసి వచ్చునప్పటికే దిక్కులేనివానిశవముగాన రాజనియమితు లగుచండాలురు తీసికొనిపోవఁ దెలుపవలయు ననియు ననుకొనుచున్నారు. నే నేమియు నెఱుఁగనివానివలెఁ బోయి యాశవమును బుజముమీఁద వైచుకొని వచ్చి మార్గమధ్యమందుఁ గూర్చుండెదను. నారదోపదేశానుసారముగ సంవర్తుని కనిపట్ట యత్నించెదను.

(సందులోనికిఁ బోయి శవమును బుజమున నుంచుకొని మరలఁ బ్రవేశించి తనలో)

ఆహా! ఏమి కాశీపురమహాజనుల భక్తిశ్రద్ధలు! ఈశవము దక్క నీపాటివేళఁ బరుండు జీవచ్ఛవ మొకఁడైన లేదుగదా! పరమేశ్వరనామోచ్చారణంబు సేయుచు గంగాస్నానమునకుఁ బోవువారేగాని యితరులు లేరు. అశక్తుఁ డెవఁడేని యుండిన

చో భస్మస్నాన మాచరించి భగవద్ధ్యానము సేయుచున్నాఁడు. అదిగో! తూర్పునఁ దెల్లవాఱుచున్నది. గంగాస్నాన మాచరించి వచ్చునాహితాగ్నులు సూర్యోదయమునకు మున్నె యగ్నిహోత్రమున హోమము గావింప వడిగా నింటికిఁ బోవుచున్నారు. దగ్గఱఁగా వచ్చి నన్నును శవమును జూచి కొంచెము దూరముగాఁ బోవుచున్నారు. అయ్యో! మైలపడితి మని సందేహించుచున్నారు కాఁబోలు. లేదు లేదు. తిన్నగా నిస్సందేహముగా నింటికే పోవుచున్నారు. అన్నట్టు మఱచిపోయినాను. కాశీపురములో నట్టిమైలవమటలు లేవుగదా! నాకీ సంశయ మేల? అదిగో! ఆనందువారు ఈపిచ్చివాఁ డెవఁడో మనసందులో శవమును ఈడ్చుకొని వచ్చినాఁ డని యనుకొనుచున్నారు. నానిజరూపము బయలుపడకుండ వెఱ్ఱివేషము నిలఁబెట్టుకొనవలయును. ఎవఁడో పిచ్చివాఁ డిటు వచ్చుచున్నాఁడే! అతఁడు సంవర్తుఁడు గాఁడుగదా! అతఁడు సంవర్తుఁడే యైనచో నారదుఁడు వచించినట్లు ఉలికిపడి పాఱిపోవలెను. సంవర్తుఁ డమర్త్యజాతివాఁడు గాన శవదర్శన మైనఁ జేయ నొల్లఁడుగదా! ఈతఁడు దగ్గఱదగ్గఱఁగా వచ్చుచున్నాఁడు. ఇది మృతకళేబర మని యాతఁడు గుర్తింపలే దేమో! అదిగాక యోగులచిత్తవృత్తి యెప్పటి కెట్లు మాఱునో ఎవ రెఱుఁగుదురు? ఏమైనను వీనికి నమస్కరించుట మంచిది కదా! అప్పుడు గూడ నున్మత్తునివలెఁ గనఁబడునట్లు నడుమనడుమఁ బిచ్చిచేష్టలు చేయుచుందును.

(పిచ్చివాఁడు ప్రవేశించి శవమును నిదానించి చూచును.)

మరుత్తుఁడు — జోగిగారూ! దండాలయ్యో! దండ్డాలయ్య!

పిచ్చివాఁడు—అండాలయ్యో! బ్రహ్మాండాలయ్యో!

మరు—(తనలో) ఇతఁడు సంవర్తుఁడు కాఁడుగదా! వీనిమాటలలో గూఢార్థము లేదుగదా!

పిచ్చి—బావా! బావా! నీమగఁడు సచ్చిపోయినాఁడా! బ్రతికింపు మన్నావా? జాతితో తల బద్దలకొట్టు. లోపలనుండి పోయినగాలి బుఱ్ఱపగుల్లో నుండి లోపలికిఁ దూఱి చచ్చిన వానిని బ్రదికించి లేవఁదీయును జుమా! నీవెందులకోయి! నేనే కొట్టి చూచెదనులే. హో! హో! ఢూ! ఢూ! (అని కాంక్షించి యుమ్మివేసి జాతితో శవముతలపైని గొట్టును.)

మరు—(తనలో)వీనియాథార్థ్యము సరిగాఁ దెలియుటలేదు. సంవర్తుఁడు మాత్రము కాఁడు. అతఁడే యైనచో శవమును చూడనే చూడఁడు. చూచినను స్పృశింపఁడు. నేను నున్మత్తునివలె సంచరింతును. (నేలమీఁదిమన్ను ప్రోగుచేసి నెత్తిమీఁదఁ బోసికొనును. వంగ్లికిలించి శవపాదములకు మ్రొక్కును.)

పిచ్చి—బావా! తలఁబ్రాలు పోసికొనుచున్నావా? నీమగనికిఁ గూడఁ బోయుము. మంత్రాలు చదివెద. ఓం ఊం ఏ ఏం ఓ ఓం ఇ ఇ ఈం పోయవేమి?

మరు—అది నామగఁడు గాదు. నీపెండ్లాము.

పిచ్చి—ఆలాగు చెప్పు. ఊఁ! ఊఁ! ఒక్కమాటు ముద్దుపెట్టుకోవ లె. (శవమును ముద్దుపెట్టుకొని) పెండ్లము పెండ్లాము పెండల ము పెండ. రండా! లేచి ముద్దుపెట్టుకో! లేవవేమి?

(చేయిపట్టి లాగును.)

మరు—(తనలో)పెండ్లాముపిచ్చి ఏపిచ్చినైనను లోఁగొఁదీయునుగదా!

(తలయెత్తి చూచి) ఆపిచ్చివాఁ డెవఁడో మమ్ముఁ జూచి బెదరి బెదరి నిలఁబడినాఁడు. అతఁడు సంవర్తుఁడు గావలయును. అతని రాజభటు లెంతో బలాత్కారముగా నిటు త్రోయుచున్నను రాకున్నాఁడు.

(పిచ్చివాఁడు వానిని త్రోసికొనువచ్చు రాజభటులును
ప్రవేశింతురు.)

రాజభటుఁడు—చచ్చిపోవుచున్నాము ఈపిచ్చివాండ్రతో. మాకుఁ గూడఁ బిచ్చి యెత్తుచున్నది. వీరిని గట్టిగా నేమియు ననరాదని రాజాజ్ఞ. మహాయోగులు జ్ఞానులు దేవతలు తుదకు విశ్వనాథుఁడుగూడఁ బిచ్చివేషముతోఁ దిరుగుదు రని వారినమ్మిక. అదియుఁ గొంత నిజమే. పిచ్చివాండ్ర నందఱ నొకమూలకుఁ ద్రోసివేసెదము. రా! రా! దానివలనఁ బ్రజలకు బాధ లేకుండఁగ నుండును.

పిచ్చివాఁడు—థూ! థూ! (కాండ్రించి యుమ్మివైచును.) థూ!!

(తప్పించుకొని వెనుకకుఁ బాఱిపోవును.)

(రాజభటులలో)

ఒకఁడు—అరే! వీని కెంతబలమురా! బాబు! పదిమందిని దప్పించుకొనిపోయినాఁడు. ఇదేకాఁబోలు వెఱ్ఱిబలము! అరే! దండ నలిఁగిపోయి బండవాఱినది. చేయి కందిపోయినది. గుండెమీఁద గ్రుద్దినగ్రుద్దుతో గుండె బ్రద్దలయిపోయినదిరా! అరే! బాబూ! వీండ్రను పట్టుకోరాదురా బాబూ!

మరు—(తనలో) ఆమహానుభావుఁడు సంవర్తుఁడు కావచ్చును.—ఆ- అతఁడే. వానిని వెంబడింతు. (పరువెత్తుకొని పోవును.)

రెండవవాఁడు—చూడు. చూడు. వీఁ డొకపిచ్చివాఁడు. ఆపిచ్చివా నివైపునకుఁ బరువెత్తుకొని పోవుచున్నాఁడు. వీనిని బట్టుకో.

మూఁడవవాఁడు—నేను పట్టుకొననురా. చాలురా బాబూ! చూడు. చేయి యంతయు గుండగుండ అయిపోయినది. నాకాలిమీఁద ఒక్కతొక్కు తొక్కినాఁడు. తొక్క రేఁగి ముక్కముక్క లయినది. నీ వీవెఱ్ఱివానిని బట్టుకొంటివా నీకుఁగూడ మాకైనయనుభవము తెలియునురా.

నాల్గవవాఁడు—అమ్మో! నాపెండ్లాము పసుపుది. రాజసేవమాట దేవుఁ డెఱుఁగును. చచ్చిపోయినానా నాపెండ్లామునకు గతి యేమిరా!

రెండ—ఆపిచ్చివానివెనుకఁ బరువెత్తుకొనిపోవుచున్న రెండవపిచ్చివాఁ డెవఁడో గాని మహారాజో మహాయోగియో కావలెను. లే కున్న నంతముఖవర్చ స్సుండునా? పాపము! వానికి నిజము గాఁ బిచ్చియెత్తినదో లేదా మాఱువేషముతోఁ దిరుగుచు న్నాఁడో.

మూఁడ—చూడుఁడీ! మొదటిపిచ్చివాఁ డెంతవడిగాఁ బరుగెత్తుచు న్నాఁడో. వానిది పిచ్చికోపము. పరుగో పిచ్చిపరుగే. అంగ లువేసికొనుచుఁ బరుగెత్తుచున్నాఁడు.

నాల్గ—వాని కేమిగాని ఆరెండవయెఱ్ఱిపిచ్చివాఁడు వానివెనుకఁ బరు గెత్తలేక వగర్చుచున్నాఁడు. ఏమి కోపమునిఁగిపోయినది. వానితోఁ బరుగెందులకో!

మొద—ఏమో! వాని కేమియూహ యున్నదో. ఈపిచ్చివాండ్రలో నొక్కొక్కఁడు చాల గొప్పవాఁ డుండును. అట్టివాండ్రు నిజ

మొగా పిచ్చివాండ్రు గారు. ఏకారణమువనో ఏశక్తిచేతనో అట్లు ప్రచ్ఛన్నులై యుందురు.

మూఁడ—ఇక్కడ నింకొక్కపిచ్చివాఁ డున్నాఁడురా! హఠాత్తు! పిక్కకొలంది పాఱిపోవుచున్నాఁడు. ఈవైపునకు పాఱిపోవుచున్నాఁడు.

నాల్గ—అరే! పెద్దవాఁడా! పిచ్చివాండ్రు మనకొంప ద్రవ్వినారురా బాబు! ఏదో శవమును దెచ్చి మార్గమధ్యమ్మునఁ బాఱవైచినారురా! అనాథశవనిర్హారణనియుక్తులైనచండాలురఁ బిలిచికొనివచ్చి తీయింపవలెను. లేకపోయినచో మనపనికి నీళ్లు వదలుకోవలసినదే.

మొద—అదిగో! అలాగునఁ బోవుచున్నాఁడు పొగరుఁబోతుతలారివాఁడు. వానిని బిలు!

(తలారి ప్రవేశించి నిలఁబడును.)

రెండ—అరే! తలారివాఁడా! నల్లతుమ్మమొద్దులాగున నిలఁబడి చూచుచున్నా వేమిరా! శవము కనిపింపదురా! తీసివేయ నక్కఱ లేదా?

తలారి—బాబూ! ఏ మధికార మయ్యా! ఆసందువారు వర్తమానము చేసినారు. వచ్చినాము. సందంతయు వెదకినాము శవము కనఁబడలేదు. ఏమి సేయు మందురయ్యా!

మూఁడ—ఆపిచ్చివాండ్రు తెచ్చి యిక్కడఁ బాఱవేసినారురా!

తలారి—అలాగునఁ జెప్పరాదు? ఏమి యంతయధికారము? మేము శవములు తీసివైచుకొండ్రము. మీరో శవాలమీఁద సొమ్ము

తీసికొనెడివాండ్రు. కొంచెము మాలోచించుకొండయ్యా! మాటలు మిగులఁజెప్పకుండి! (మఱొకనిని పిలిచి శవమును తీసికొనిపోవును.)

నాల్గ—మాటాడక పోవోయి! (పిచ్చివాండ్రవైపు చూచి) ఓయి బాబో! ఎంతదూరము పోయినారురా పిచ్చివాండ్రు! ముందుపిచ్చివానిని వెంటాడించినాఁడు రెండవపిచ్చివాఁడు. వానిని వదలిపెట్టలేదు. అదిగో యిద్దఱకుఁ గాళ్లు నొప్పులు పుట్టినవి కాఁబోలు! ఆమఱ్ఱిక్రింద నిలఁబడినారు. ఆమఱ్ఱిక్రింద వెఱ్ఱివాం డ్రేమి మాటలాడుకొందురో వినెదమా!

మొద—నీకుఁ గ్రమముగా వెఱ్ఱియెత్తుచున్నది. మనకు ముందు పని యున్నది. పదపద. వెఱ్ఱివాండ్రమాటలు మన కెందులకోయి! రండి రండి.

(రాజభటులు నిష్క్రమింతురు.)

మరుత్తుఁడు—(యోగికి నమస్కరించును.)

యోగి—థూ! థూ! పో! పో!

మరు—మహానుభావా! రక్షింపుము రక్షింపుము!

యో—(పిచ్చినవ్వు నవ్వి) మీబావ మీయూరనే యున్నాఁడు పో!

(కాండ్రించి యుమ్మివేయును. ఱాళ్లు విసరును.)

మరు—సంవర్తా! నీ వుమ్మివైచినను ఱాళ్లు విసరినను నేను పోవువాఁడను గాను. శరణు శరణు.

యో—(తనలో) వీఁడు పిచ్చివాఁడు గాఁడు. అట్లైనచో నాపేరెట్లు వీనికిఁ దెలియును? (పైకి) నీ వెవఁడవు? నిజము చెప్పుము ఇరు

పౌర్వములు నెవరును లేరు గదా! (కలయఁజూచును.)

మరు—మహానుభావా! నేను మరుత్తుఁడను. మీదర్శనమునకై వచ్చి నాను.

సంవ—నన్ను నీ వెట్లు గుర్తించితివి? నిజము చెప్పుము. లేకున్న నీ తల వ్రక్క లగును జుమీ!

మరు—సత్యమే చెప్పెద. నారదమహర్షి నీనామరూపాదు లెఱింగిం చెను. దీనుఁడ. శరణుసొచ్చితి. రక్షింపుము.

సం—పరుల కెఱుంగరాకుండ నున్మత్తునివలె నున్నానుగదా! నార దుఁడు నా నామరూపములుసెప్పినను దూరమునుండియే నన్ను నీ వెట్లు గుర్తుపట్టి వెంబడించితివి?

మరు—నారదమహర్షి నా కెఱింగించినప్రకారము ఒకశవమును ముం దు పెట్టుకొని కూర్చుంటిని. ఆశవమును జూచి యులికిపడి పా ఱిపోయినయున్మత్తుఁడు సంవర్తుఁ డగు ననుటచే నీవు సంవర్తుఁడ వని గుర్తించితిని.

సం—అట్లు చెప్పుము. మహారాజ వైననీవు పిచ్చివానివేషము ధరిం చుటయే గాక దిక్కుమాలినశవమును మోచుకొని కూడ వ చ్చినావా? నాకై యెంతప్రయాసపడితివి! అయ్యో! ఇంతకు నీకు నావలనఁ గావలసినకార్య మేమి?

మరు—సంవర్తా! నా కభయహస్త మిమ్ము. నిన్ను శరణ మొందితి.

సం—అమరాధిపతికిఁ గూడ నభయహస్త మియ్యసమర్థుఁడ వగునీకు నభయ మీయ నే నెంతవాఁడను. భవదభిలషితం బెఱింగింపు.

మరు—మదీయకులగురువంశజాతుఁడ వగు నిన్ను నేను నాయాగ మున నుపదర్శనంబు గావింపఁ గోరుచున్నాను.

సం—మరుత్తా! మాకు వంశపరంపరగా వచ్చుచున్నయును మహోజనా శ్రియంబును యాజకత్వంబును మా కన్నయగు బృహస్పతి గ్రహించి నన్ను నింటనుండి వెడలఁగొట్టినాఁడు. భవదీయ కులయాజకత్వము వానిదే. కావున వాని నభ్యర్థింపుము. అతఁడే దాని కర్హుఁడు.

మరు—సంవర్త్తా! వానిప్రోత్సాహముననే నేను యాగసంభారములు సిద్ధము గావించి వాని నుపద్రష్టగా వరింపఁబోవ నన్నతఁడు నిరాకరించి పొమ్మనెను. ఇంక వాని నభ్యర్థింప సాధనం బో ల్లదు. అమర్త్యసాధునకు యాజకుఁ డగుతనకు మర్త్యుఁడ నైన నాకు యాజకత్వమున కొప్పుకొనుట గౌరవహీనిమూల మఁట. ఇంతకు వాని నన్నేల? దివస్పతిమాటలకు లోనై బృహస్పతి నన్ను నిరాకరించెను.

సం—బృహస్పతిమాటలకు లోనై దివస్పతి నా కన్యాయ మాచరించినాఁడు. దివస్పతిమాటలకు లోనై బృహస్పతి నీ కన్యాయ మాచరించినాఁడు. ఎట్లైన నేమి? ఇద్దఱును తోడిదొంగలే. కావుననే వానిరాజ్యమున నుండ నొల్లక యాలోకముగూడ వీడివచ్చి యిటఁ బిచ్చున్న వేషముతోఁ గాలక్షేపము సేయు చున్నాను.

తే. రాజు తనయాశ్రయంబున • రాజపురుషు
లాడుమాటలు విని ప్రజ • కహితరీతి
నడుపఁ జూచిన వాని య•న్యాయరాజ్య
మందు నివసింపఁ బ్రజకుఁ బ్రా•ణాంతకంబు.

అమరగురుం డనుపేరు పెట్టుకొని నాయన్న యాచరించునన్యా యమునకు మేర యున్నదియా? తుదికి అమరవిభుండు నట్లె

యయ్యె. నిన్నుఁ జూచినమున్న గూడ వాని కీర్ష్య యుండెడి
ది. వానికిఁ దోడై బృహస్పతి నేఁ డిట్లు సేసెను. అస్మ
జ్జనకుం డైనయంగిరసునిద్రవ్యమును కులయాజకత్వమును దా
నాక్రమించుకొని యున్నవుడు నీయాగ మేల సేయింపఁడో
గట్టిగా నడుగుము. అతఁడు పూర్తిగా నిరాకరించినచో నన్ను
వరింపుము. అపుడు నీచేత యాగము సేయించెదను.

మరు—మహానుభావా! ఆచివరమాట యొక్కటియే చాలును. నా
కా వరము దయసేయుము.

చ. అవమతిసేసి పొమ్మనిన • యాతని నెట్టులు వేఁడికొందు గౌ
రవమున మిన్నయైనయల • రాచకొలంబునఁ బుట్టినాఁడ నా
దివి భువి యొక్కటైన నల • దేవగురుం వరియింప నొల్ల నా
దివిజమునీశసత్కృపను • దేవ! భవత్పద మేను బట్టితిన్.

ఉ. ధన్యుని నన్నుఁ జేసెదొ హ•తంబుగఁ జేసెదొ నామహాశ సం
మాన్యచరిత్ర! నీదయ క్రి•షంబని యెంచక నన్నుఁ గావుమీ
యన్యుఁడ గాను మాకులము•యాజకుఁ డౌఁ గద మీదుతండ్రి నే
నన్యునిఁ గోర నొల్ల భవ•దగ్రజుమాట తలంప నెన్నఁడున్.

సం—నాయగ్రజునియెడ నా కెంతరోఁత గలిగినదో నీకును వానియం
దంతరోఁత. గలిగినది. కావున నీకు నేను సాహాయ్యము సే
యుట యుచితము.

ఉ. ఓయి మరుత్త! నీయెడల • నుద్భవ మందిన ప్రేమ ముంచుమీ
యాయమరేంద్రుమీఁదఁ గల • హంకృతి దప్పఁగ నుండనిమ్ము నా
కాయమరేశయాజకము•దగ్రజునందులఁ గల్గుక్రోధమే
సేయును నన్ను యాజకునిఁ • జేయుము యాగము శత్రుభంగమున్.

మరు—ధన్యుఁడను. భవదాజ్ఞకు బద్ధుఁడను. (నమస్కరించును.)

సం — మరుత్తా! మహేంద్రుఁడేని మహేంద్రపురోహితుఁడేని తుదకు మహాదేవుఁడేని మనలఁ బ్రతిఘటించుఁగాక! లెక్క సేయ నక్కఱ లేమ. ప్రతిఘటించినవారి నుక్కడంతువుగాక. అది యటుండనిమ్ము.

తే. గంగసాక్షిగఁ బలికెద ♦ గర్వ మనకు
మమరగురుఁ డైన నమరుల ♦ యధిపుఁ డైన
బంటు లై యుండ్రు నీయాగ ♦ వాటమందు
వారిమాయకు నీవు లోఁ ♦ బడక యున్న.

దివస్పతిబృహస్పతు లిద్దఱును మహామాయావులు. నీవు వారి మాయలకు లోఁబడి న న్నతిక్రమించి పోతివేని శాపాగ్నిచే నిన్ను సవంశముగా నిలువున నీఱు గావించెద.

మరు — గురువరా! మీపాదయుగళి వీడి పోవుదునా? దేవమానవ రక్షఃపిశాచాదిగణంబు లొక్కటియై మాయలు పన్నుఁగాక. ఆమాయలకు లోను గాను. ని న్నతిక్రమించి వర్తించితినేని నిఖిలభావిలోకగతులకు నేను దూరుండ నగుదు. మీశాపావశ్యకత లేకుండఁగనే నాచేసినగురుద్రోహంబునకు మిత్రద్రోహంబునను సవంశముగా నేనే నశింతును.

సం — నీ కిప్పు డిట్లు తోఁచినను బాధలు గలిగినప్పుడు భావము మాఱు నేమో. అన్యు లాసలు గొలిపినప్పు డాశయ మంతయు నకటావికట మగును.

ఉ. బాధలు వెట్టఁ జూచెదరు ♦ బాధల నన్నిటిఁ బాపుకోవలెఁ
యోధులదండు పంపెదరు ♦ యోద్ధలఁ గూర్చి జయింపఁగావలెన్
శోధన సేసి యన్నిటికిఁ ♦ జూడవలెం బరిహారమార్గముల్
యోధవరా! మరుత్త! హృద ♦ యోద్ధతి డింపఁగరాద యెన్నఁడున్.

మరు—గురువరా! మీ రిన్నివిధములఁ జెప్పవలయునా? నేను మీ మ్మిట్లు బాధపెట్టుటయే కాక ద్రోహముగూడఁ జేసెదనా? నాశపథము చిత్తగింపు.

ఉ. ప్రాణము వోయినన్ జనని ♦ వాక్యము దాఁటుట సంభవించినన్
బ్రాణముకంటె నెక్కుడుగ ♦ భావనసేయుదుఁ దండ్రి వానిదా
ప్రాణము సేతులారఁగను ♦ బాపెడుపాపము సంభవించినన్
బ్రాణుల నీదుపాదములు ♦ పట్టితి దాఁటన నీదుమాటలన్.

సం—నే నింతవఱకు భూలోకమున నానామరూపంబులు ప్రకటింపక ప్రచ్ఛన్నుఁడనై యుంటిని. ఇంక నానామరూపంబులు ప్రకటింపక తప్పదు. ఆంగిరసుండనైననేను నీయాగమున కుపద్రష్టనయ్యెదను. సరేకాని—

మరు—ధన్యుఁడను. ఏమిసెలవు?

సం—మహేంద్రుని మించ నీవు సేయఁదలఁచినయాగంబునకు మహామేరువును మించిన ధనరాసులు గావలయును. నీవు మహేంద్రునికంటె మహత్తరధనసంపన్నుఁడవు గావలయును. కావున ముందు ధనసంపాదనం బావశ్యకము. నాలుగు మట్టిపాత్రలతోను నాలుగుమేడికఱ్ఱలతోను నాలుగురావికఱ్ఱలతోను తవ్వైషవేతితోను యాగము అయిన దనిపించుటకు నేను బృహస్పతిని కాను.

మరు—మహానుభావా! నేను ధనాకర్షణమున కేదిక్కునకును జయయాత్ర వెడలలేదు. దిగ్విజయయాత్రలో నానుషంగికముగా లభించినధనరాసు లాయాదేశస్థులకే యిచ్చుచుండెడివాఁడను. యాగార్థము ధనసంపాదనముసేయుట తప్పు గాదు గావున

ఉత్తరదిగ్విజయంబు సేసి ధనరాసులు సంగ్రహించుకొని వ
చ్చెదను.

సం—ఉత్తరదిగధిపతియొద్ద నే మున్నది ? నవనిధులేగదా ! తొమ్మిది
మంతలసా మ్మెంత ? నీధనసంపత్తి చూచినఁ జతుర్దశభువనం
బులవారును వెఱఁగుపడవలదా !

మరు—అట్లయిన నలుదిక్కులయందును గలధనరాసు లాకర్షించి తె
చ్చెదను. దండువెడలెదను. సెలవిమ్ము.

సం—దానఁ బ్రజలకు బాధ కలుగదా ? అది దిగ్విజయంబు గాదు;
బందిపోటుఁదనము.

మరు—సంవర్తా ! అది సత్యమే కాని,

ఉ. ప్రజలను బాధపెట్టకయె • స్వర్ణపురాసులఁ జేర్చి పెట్టి ది
గ్విజయము సేయుటన్న జన•విత్తము దోఁచుట గాదె శత్రురా
ట్ప్రజలకు విత్తముల్ వినువ • రాజు మహాధనసాధ్యకార్యముల్
నిజబలరక్షణాదులను • నిత్యము నెట్టులు సేయఁ జాలెడున్.

సం—మరుత్తా ! మన యీప్రసంగానుప్రసక్తితో విలంబము సేసిన
మనయథార్థస్థితి యితరులకు బయలుపడును. రాజనీతివిశేషంబు
లావల విచారింపవచ్చును. ప్రకృతము పరులకు బాధ లేకుం
డఁగ ధనరాసులు సంపాదించునుపాయ మొకటి చెప్పెదను.
అట్లు గావించిన మహేంద్రునియైశ్వర్యమును మించినయైశ్వర్య
మును సంపాదించి యాగము సువర్ణపాత్రిలతో సువర్ణయూప
ములతో సువర్ణశాలలలో మహాస్వర్ణదానంబులతో షడ్రసో
పేతామృతాహారదానంబులతో చతుర్దశభువనంబులవారును
సెబాసు అనునట్లు గావింపుము.

మను—మహర్షీ ! మంత్రిసిద్ధా ! ఏమి యీయుపాయము ?

సం—హిమవంతంబున కుత్తరంబున ముంజవంతంబను పర్వతంబు గలదు. అనగ్రప్రాంతప్రదేశ మంతయుఁ గాంచనమయంబు. అందుఁ బరమేశ్వరుండు పార్వతీసహితుండై సంచరించును. అది పరమేశ్వరానుగ్రహపాత్రులకుఁ దక్క నొరులకు దుర్గమంబు. సద్గురూపదిష్టరీతిని శివసహస్రనామమంత్రపఠనంబు సేయువానికి సుగమంబు.

మరు—నీబోఁటిసద్గురువు నాశ్రయించినవా కది సుగమమే కదా!

సం—సందేహ మేమి? నీవు నీపురంబునకుఁ బోయి శకటాదిసాధనంబులను భారవాహులను వెంటఁబెట్టుకొని హిమవత్సమీపమునకు రమ్ము. నే నక్కడ నీకై ప్రతీక్షింతు. ధనరాసులు తండోపతండములుగాఁ దెచ్చుకొనవచ్చును. సపరివారుండవగు నీ కది సుగమ మగునట్లు మహామంత్ర మువదేశించి నీకు సహాయుండనై యుండెద.

మరు—గురువరా! మహాప్రసాదము.

సం—ఈ కాశీపురప్రాంతము దాటువఱకు సున్మత్తవేషముతోనే చెలికొనుము... 

రొంకమూలకుఁ బోవుదము.

(నిష్క్రమింతురు.)





# మరుత్తరాట్చరిత్ర.

## తృతీయాంకము.



### విష్కంభము.

విద్యాధరుఁడు—(ప్రవేశించి) ఈర్ష్యాపిశాచ మావేశింపకుండ నుండవలెఁ గాని యావేశించెనేని ఉచ్చాటన చేయుట కష్టము.

తే. ఔర! యేమందు జగతి నీ♦ర్ష్యాపిశాచ
మావహిల్లినవారల♦యాత్మ యెపుడు
దుఃఖమయ మగుఁ బరులసం♦తోషవార్త
కర్ణశల్యంబువారికిఁ ♦ గలదె ఫలము ?

తే. అధికతర మైనసంపద ♦ లందువారిఁ
జూచి యోర్వనివానిని ♦ నీచుఁ డందు
రల్పు లభివృద్ధి నొందిన ♦ నాత్మతుల్యు
లగుదు రనుభీతి నోర్వని♦యాతఁ డెవఁడొ ?

ఇందు కెనంతవానికే యింతయీర్ష్య యుండ నితరులమాట చెప్పవలయునా ? ఏమో ! ఒకవేళ, వేయిచూపులవానికి చూపోపమిగూడ వేయిరెట్లు లధికముగా నుండు నేమో ? అయిన

ను, ప్రభువుల కట్టియొయ్యష్య గలిగనేని ప్రజలకు బాధలు గలు
గును.

(తెరలో)

బాధలు కలుగు నని నెమ్మదిగా ననుచున్నావా ?

విద్యా—గంధర్వకులపతీ ! నీవా ? రావయ్యా !

గంధర్వకులపతి—(ప్రవేశించి) బాధలుకలుగు నని నెమ్మదిగా ననుచు
న్నావా ? ఈస్వర్గము విడిచిపోయిన బాగుగా నుండు నన్నంత
కష్టము తోఁచుచున్నది.

విద్యా—అందఱు నట్లే యనుచున్నారే. మీకుమ్మల నెందులకైన ని
యోగించినారా యేమి ?

గం—అయ్యో ! చెప్పుకొనుటకు సిగ్గు. వినియే యుందువు. అయిన
ను జెప్పెద. విను.

విద్యా—ఏమది ?

గం—మేము భూలోకమునకుఁ బోయి మరుత్తునిమెడఁ బ్రజలకు ద్వే
షము గలిగింపవలయు నఁట. మహేంద్రునిగుణము లన్నియు
మంచిగుణంబు లని గానముసేయవలయు నఁట.

విద్యా—భూలోకమునకుఁ బోయి వచ్చినారా ?

గం—ఇప్పు డక్కడనుండియే వచ్చుచున్నాము.

విద్యా—భూలోకమున మీప్రయత్నము కొనసాఁగెనా?

గం—కొనసాఁగుట కేమున్నది? మామాటలు మాపాటలు వినినవా
రే లేరు. మరుత్తునిమెడఁ బ్రజలకును బ్రజలమెడ మరుత్తున
కును గలమంచిభావము బ్రహ్మకైన భేద్యంబుగాదు. వానిపరి
పాలనమున నెంత వెదకినను దోషము లేశమైనఁ గానరాదు. మన
మహేంద్రునిచర్యలు వినుటచే, మహేంద్రుఁ డన్న నిదివఱకే

వారిమనస్సులలోఁ గొంచెము ద్వేష ముదయించినదిగాని సకల సామ్రాజ్యాధిపతియు యాగఫలదాయకుఁడునుగాన నేమి యనుటకును సందేహించుచున్నారు. మాబోధనములు వినినపుడు మామీఁదను మహేంద్రునిమీఁదను గూడ మానవులకు రోఁత పుట్టుట ప్రారంభ మయినది. దానితో మేము వెనుకకు మరలి వచ్చినాము.

విద్యా—అప్సరసలయత్నము లేమియు నెఱవేఱలేదా ?

గం—మనుజులలో మహానుభావుఁ డెవఁడైన బయలుదేఱినచో, వానిని జెఱుపుటకు మనవారికి మహాసాధన మామాయసానులు. అదిగూడ నేఁడు వ్యర్థ మైనది. మానవలోకమున అందును గంగాగోదావర్యాదిమహానదీప్రాంతమున అక్కడ నిక్కడ నన నేల ? చతుస్సాగరపర్యంతప్రదేశమున వేల్పువేశ్యలయాట లిప్పుడు సాఁగుట లేదు. అచ్చటిదంపతులు పరస్పరము ధర్మార్థకామములయం దనతిక్రమణీయబంధము గలవారు. ఎవ్వఁడేనిక్కుటిలిపడువాఁ డుండెనా యాతనిమనస్సునకు భూలోకవేశ్యలువచ్చినట్లు ఈవేల్పువేశ్యలునచ్చరు. ఆచంచలాక్షులచూపుసొగసులకు రుచిమరగినవారికి మనవేల్పుసానులదయ్యపుఁ జూపులు రుచింపవు. భూలోకవేశ్యల యానందస్విన్నగాత్రస్పర్శము వారిహృదయంబులఁ బ్రేమార్ద్రంబులఁ గావించు. అట్టి వారికి ఆనందజాతస్విన్నత యెఱుఁగనికఱ్ఱబొమ్మలు కమనీయంబు లగునా ?

విద్యా—నిజము నిజము. అప్సరసలుగూడఁ దిరిగి వచ్చినారా ?

గం—భూలోకమున నిలఁబడలేక వచ్చినారు. ఇంద్రునిబలాత్కారమున భూలోకమునకుఁ బోయి వలపులేనివారికి వలపు గలిగిం

పఁ గావలసినన్నియత్నములు గావించి తుదికిఁ బరాభవపాత్రమై నేలపై నిలువలేక వచ్చిన వారిగోల యేమని చెప్పను?

విద్యా—బాగు బాగు. పోనీ- వెడలినవారందఱు మరల స్వర్గమునకు వచ్చినారుగదా! ఏబ్రాహ్మణశాపముననైన హీనజన్మ మెత్తకుండ దాఁటి వచ్చినారు. అంతే చాలు. సంతోషింపవలసినదే.

గం—అదిమాత్రము జరుగలేదు. విద్యాధరా! నాకొకసందేహము గలిగినది. అది నీవు విడఁగొట్టవలయును.

విద్యా—ఏమది? నాకు శక్య మగునేని సంశయనివృత్తి చేసెద.

గం—ఇంతమందిని ఇంద్రుఁ డిట్లు బాధపెట్టుట యేల? మర్త్యమాత్రుఁ డైన మరుత్తుని లొంగఁదీయుటకై వజ్రము ప్రయోగింపరాదా? అది పౌరుషముగాని ఇదేమిపద్ధతి యయ్యా!

విద్యా—(నిరసనముతో) ఆఁ! వజ్రము గిజ్రము అక్కడఁ బనిసేయవు.

గం—ఏల? మరుత్తుఁడు కులగిరులకంటె గట్టివాఁడా?

విద్యా—అదికాదు. దానికిఁ గారణము వేఱుగా నున్నది.

గం—ఏమది?

విద్యా—మరుత్తుఁడు సంవర్తు నాశ్రయించి యున్నాఁడు.

గం—ఆశ్రయించిన నేమి? అతఁడుమాత్రము వజ్రాయుధపుదెబ్బల కాఁగునా?

విద్యా—అతనిబ్రహ్మబలము సామాన్యమనుకొంటివా యేమి?

గం—ఈదంభోక్తుల కేమి? ఇట్టిదంభోక్తులు విని దంభోళిధరుఁడు దంభోళి మూల దాఁచినాఁడా యేమి?

విద్యా—బ్రాహ్మబలమునుగుఱించి దంభోక్తులనకుము. దంభోక్తులో అదంభోక్తులో పర్యవసానమునఁ దెలియును. మనజంభభేది

చ్యవనునిదెబ్బ తిన్నప్పటినుండియు బ్రాహ్మణులజోలికిఁ బోఁడు. బ్రాహ్మబలమన్న భయము పుట్టినది.

గం—చ్యవనునిదెబ్బ యంటివి. ఏమది ?

విద్యా—అశ్వినీకుమారులు చ్యవనునికి వార్ధకంబునఁ బయచుఁదనపుఁ బటుత్వము గలుగుటకు మందిచ్చి యున్నారు.

గం—ఔను. అది విన్నాను.

విద్యా—చ్యవనుఁడు ఆతనిమామచే యాగము చేయించుచు అశ్వినీకుమారులకుఁ గూడ హవిర్భాగము లిచ్చునట్లు క్రొత్తయేర్పాటు గావించినాఁడట.

గం—బాగుబాగు. కృతజ్ఞత చూపినాఁడు. మంచివారి కుపకారము చేసినచో వ్యర్థ మగునా ?

విద్యా—అది మనమహేంద్రుఁడు నిషేధించెను.

గం—వానికొంప యేమి మునిఁగినది ? తనకుఁ బెట్టకుండ నితరులకుఁ బెట్టలేదుగదా ?

విద్యా—అశ్వినులు దేవవైద్యు లఁట. వైద్యులకు హవిర్భాగాధికారము లేదఁట.

గం—వైద్యులుగనుకనే తప్పక హవిర్భాగ మీయవలయును. వారివలన నెందఱెందఱో సుఖ మొందుచున్నారు. వారిసాహాయ్యము కోరనివా రెవ రుందురు ? వారితో విరోధము తెచ్చుకొనుట మంచిది కాదు. తుది కేమైనది ? వారికి హవిర్భాగ మిచ్చినారా ?

విద్యా—చ్యవనుఁడు ఆశ్వినేయులకు హవిర్భాగము లిచ్చితీరెద నని యింద్రుని ధిక్కరించిమాటలాడి అరీతిగా మంత్రపూర్వకముగ హవిర్భాగ మిచ్చినాఁడు.

గం—మహేంద్రుఁ డొప్పుకొన్నాఁడా ?

విద్యా—మొదట ఒప్పుకొనెదువాఁడా ? వజ్రి తనవజ్రాయుధము ప్రయోగింపఁబోయె.

గం—ఆఁ! బ్రాహ్మణునిమీఁదనా ? అశ్వినులమీఁదనా ?

విద్యా—అందఱిమీఁదఁగూడఁ బ్రయోగింపఁబోయె.

గం—అయ్యయ్యో! బ్రహ్మహత్య చుట్టుకోలేదుగదా !

విద్యా—చ్యవనుఁడు సామాన్యబ్రాహ్మణుఁ డనుకొన్నావా? అతఁడా గోపోద్రేకంబున అప్పుడే యొకహోమము గావించి యుగ్రరూపుఁ డగునొక రాక్షసు సృజించె. అప్పు డారాక్షసుఁ డింద్రుని మ్రింగెద నని యింద్రునిమీఁదికి దుమికినాఁడు.

గం—బాగుబాగు ! తర్వాత!తర్వాత!

విద్యా—తర్వాత నేమున్నది ? వజ్రధరుఁడు వజ్రసహితముగా బ్రాహ్మణోత్తముపాదములపైఁ బడినాఁడు.

గం—అప్పు డాబ్రాహ్మణుఁడు శాంతించెనా ? ఆరాక్షసుని శాంతింపఁజేసెనా ?

విద్యా—ఆఁ ! శాంతింప కేమి ? శాంతింపఁజేయ కేమి ? బ్రాహ్మణునికి మనస్సులోఁ గోప ముండునా ?

చ. పవనము నగ్ని నీరము స్వభావగుణంబును వీడనట్టు బ్ర
హ్మవరుఁడు వీడకుండునుగదా! స్వగుణం బగుశాంతబుద్ధి హే
తువు దగురీతిఁ జూపకయె ద్రోహము సేసెనుదుష్టబుద్ధిపై
రవిలెడునంతలోన యపరాద్ధుఁడు కాళ్లఁ బడంగ శాంతుఁ డౌ.

బ్రాహ్మణుని కెవ్వడేని కొంచెము వాక్కాఠిన్యము ఉండునే మోగాని హృదయకాఠిన్య మెన్నఁడు నుండదు.

గం—నిజమే నిజమే. మరుత్తునిపైకి వజ్రాయుధము పంపకుండుటకుఁ

గారణ మిప్పుడు తెలిసినది. అందులకే బృహస్పతి నంతగా బతిమాలుచున్నాఁడు.

విద్యా—వైజయంతమున ఇంద్రుఁడు బృహస్పతియుఁ గూడ నున్నారా యేమి?

గం—ఔఁ! మేము భూలోకస్థితి చెప్పినతర్వాతవా రిరువురు నేదియో యాలోచించి అగ్నిహోత్రుని మరుత్తునొద్దకు దూతగాఁ బంపినారు. అగ్నియు వారిబలాత్కారమున విసుగుకొనుచు భూలోకమునకు వెడలినాఁడు. ఎవరికైనను తప్పదుగదా!

విద్యా—విశేషము లరయ నేనును వైయంతమునకుఁ బోయివచ్చెద.

గం—నాకు సెల విమ్ము. ఒకమాఱు ఇంటికిఁ బోయి వచ్చెద.

(నిష్క్రమింతురు.)

(వైజయంతమున ఆలోచించుచున్నమహేంద్రుఁడును
బృహస్పతియు ప్రవేశింతురు.)

మహేం—గురువరా! నాయవస్థ దలఁచికొనిన నాకే వింతగా నున్నది. అబ్బబ్బా! మహేంద్రపదవి నొందుటకంటె ఇంతగంగామృతము ద్రాగి గంగాతీరమున నేవృక్షమూలముననో కూర్చుండి కాలక్షేపము సేయుట యుత్తమ మనిపించుచున్నది. కాని, ఎట్లయిన లభించినపదవి రక్షించుకొనక తప్పదు గదా! నాఁడు సవతితమ్ము లగుదానవుల హింసింప మానవసాహాయ్య

ము పొందవలసివచ్చినది. మానవులు క్రమముగా మహా
న్నతపదవి నొంద నభిలషించి మనల లోఁకువనేసి మాటిమా
టికి మహేంద్రపదవి లాఁగికొన మహారంభయాగంబులు సేయ
మొదలిడినారు—ఇప్పుడు మునుపటివలెఁ గాదు. మూలమూ
లలందున్నవా రందఱు పైకి వచ్చి మాకు స్వారాజ్యము కావ
లె నని కొందఱు మాకు సామ్రాజ్యమే కావలయు నని కొం
దఱు మాకు మహాసామ్రాజ్యమే కావలయు ననువారు కొం
దఱు మాకు మహేంద్రపీఠమే కావలయు ననువారు కొందఱు
ను బయలుదేఱి మితిమీఱి మాటలాడుటయే గాక యేదియో
యొకయాగ మాచరింప దీక్ష వహించుచున్నారు. ఏమి చేయు
దము ? మొదట మనమే నెత్తిమీఁద నెక్కించుకొనినాము.
వారిని నేఁడు దిగు మనిన వారికిఁ గష్టము. ఆహా ! సిగ్గు ! సి
గ్గు ! మనము మధ్యమలోకవాసులకు మనయగ్నిహోత్రుని
స్వయముగా దౌత్యమునకుఁ బంపుట సంభవించినదా ! మన
యాజ్ఞాపరికార మాతఁడు యాగ మాఁపఁడేమో యని సంశ
యమా !

బృహ—అంతియే కాదు. మున్ను యాగోపదర్శనము నిరాకరించిన
యమరాచార్యుఁడే యాగోపదర్శనము సేయ స్వయముగా న
భ్యర్థించుచున్నాఁ డనువార్త పంపుటయో ! అదికూడ నాతఁ
డు నిరాకరించునేమో యని యాందోళనమా! అహాహా!

మహేం—గురువరా ! ఆతనియాగ మేయుపాయంబున నైనను మా
న్పఁవకున్నచోఁ జాలఁ జిక్కులున్నవి. మన మప్సరఃపరిముఖుల
మూలమునఁ జేసిన యుపాయము లన్నియు వ్యర్థము లైనవి.

వానియాగ మాఁగుట కెవ్వరికిని శక్యము కాలేదు. నాశక్తి
యంతయు ధారపోసితిని.

తే. క్షాత్రబల మెంతయున్నను • గార్య మేమి
బ్రాహ్మబల మింత తోడయి • పరఁగకున్న
బ్రాహ్మతేజోభిరక్షణ • బలముకల్మి
మర్త్యమాత్రునిదరిఁ జేర • మదిని వెఱతు.

తే. అట్టితేజంబు నణఁపఁగ • నలవి యైన
బ్రాహ్మతేజంబు నీయంద • వఱలుఁ గావ
నామరుత్తునియాగంబు • నాఁపుసేయు
మయ్య! గురువర్య! గౌరవ • మరయ వయ్య!

బృహ—సత్యమే. బ్రాహ్మక్షాత్రబలంబులు రెండును బరస్పరము స
హాయ మైన నెద్దియేని సాధింపవచ్చు.

తే. బ్రాహ్మబల మెంతయున్నను • ఫలిత మేమి
క్షాత్రబల మింత సాయమై • కలియకున్న
మూలఁ బడియున్నసంవర్త • మూఢమతికి
నామరుత్తుండు గూడ నేఁ • డడరెఁ బొగరు.

నాచేత నైనపని కింతగా మీరు చెప్పవలయునా ?

తే. భవదభీష్టార్థసిద్ధికై • పాటుపడెదఁ
ద్వద్విరోధి మరుత్తుఁడు • మద్విరోధి
వానియాజకుఁ డైనమ • ద్భ్రాతమీఁది
ద్వేషవహ్నియె దహియించు • ద్వేష్యగణము.

ఇప్పుడు మహాయత్నంబు సేయవలసివచ్చినది. మున్నె యైన
చో నాయందలిభక్తి చేతనో భయముచేతనో నేను వలదన్న
నాతఁడు యాగము మానకుండునా ?

తే. భృత్యజాతి యనెడు ♦ మర్మంబు సెప్పఁజూఁ
జేత నున్నవానిఁ ♦ జేతులార
విడిచినార మపుడు ♦ విడివడి యాతండు
వెఱ్ఱియోగిఁ గూడి ♦ వేఁచు నిపుడు.

మహేం—కానిమ్ము. ఇపుడు మన మేమనుకొనిన లాభ మేమున్నది? అప్పుడు నీవైనఁ గట్టిగాఁ జెప్పినచో నే నొప్పుకొనకుందునా?

బృ—నేను కొంతదూరము చెప్పి చూచితిని.

తే. ప్రభులు తాత్కాలికం బైన ♦ ఫలము గోరి
యాశ్రితాళికి నెద్దియో ♦ యాజ్ఞ యిడుదు
రది హితేతర మనిసెప్ప ♦ నాలకింప
రధిక మాతనిపైఁ గోప ♦ మపుడ గల్గు.

మహేం—మీవంటియమాత్యులుగూడ నట్లు సంశయించిన నింక నేమున్నది! ఇంతకు-

ఆ. హితము సెప్పువాఁడు ♦ హితమును వినువాఁడు
దుర్లభుండ యనుట ♦ ధ్రువము జగతి
గురుబహిష్కృతునకు ♦ గురువుగాఁ గుదురు బ్రా
హ్మణుఁడు గల్గు నంచు ♦ నరయ నైతి.

సరే! జరిగినదానికై వగచిన లాభ మేమి? మనము దూత గాఁ బంపిన యగ్నిహోత్రుని మాటలు విని మరుత్తుఁడు యాగయత్నమున నుండి విరమింపకుండునా!

బృ—మున్ను నిరాకరించిన నేనే యాగోపదర్శన మభ్యర్థించితి నన్న వార్త వినెనా మరుత్తుఁడు సంవర్తుని విడిచి యొక్కపరుగున మనయగ్నిహోత్రునితోఁ గలిసియే వచ్చును.

ద్వారపాలుఁడు—(ప్రవేశించి) మహేంద్రా! జయము జయము. అ

గ్నిహోత్రుఁడు భూలోకముననుండి వచ్చి ద్వారమున నిలిచి యున్నాఁడు.

బృ—ద్వారపాలా! ఒకఁడే వచ్చినాఁడా? ఇతరు లెవరైన వానితోఁ గూడ వచ్చినారా? ఒకరాజుగూడ రాలేదా?

ద్వా—ఒక్కఁడే. మహావిచారముతో నున్నట్లున్నాఁడు.

మహేం—శీఘ్రముగ రమ్మనుము.

అగ్ని—(ప్రవేశించి వడఁకుచు) మహేంద్రా! విజయోస్తు.

మహేం—అగ్నిహోత్రా! యేమి వివర్ణవదనుఁడ వై యున్నట్లున్నావు? నీవర్చస్సు మాఱిపోయినది. ఏమి! ఏమి! ఆనీతిదూరుండు దూతిగాఁబోయిననిన్ను దుర్నయంబున నేమైన నవమానపఱచెనా?

అగ్ని—మహేంద్రా! మరల మీదర్శనము చేయుభాగ్యము పట్టినందులకు సంతోషించుచున్నాను.

బృ—(మీఁదఁ జేయి వైచి నిమురుచు) అగ్నిహోత్రా! ఏమియీ గుండెలదడ? ఏమియీభయము? విశ్రమించి నిర్భయముగా జరిగిన దంతయుఁ జెప్పు. సంవర్తుఁడు నిన్నేమైన ధిక్కరించెనా? మరుత్తుఁడే మర్యాదమీఱి మాటలాడినాఁడా?

అగ్ని—దివస్పతిబృహస్పతులారా! ఆసంవర్తుతేజంబు చూడఁగానే నాకు వడఁకు పుట్టినది. తుద కతఁ డొకమాటమీఁదఁ గోపము నొంది కన్నెఱ్ఱచేసి నన్ను భస్మావశేషుని గావించెద నన్నప్పుడు కలిగినగుండెలదడ కొంచెమయినను తగ్గలేదు. ఇప్పుడు సురాచార్యహస్తస్పర్శప్రభావంబునఁ గొంచెముధైర్యము వచ్చినను మరల సంవర్తముఖవక్త్రక్రోధరేఖ జ్ఞప్తికి వచ్చి గుండె గుభేలుమనుచున్నది.

బృ—నీవు సర్వదాహకుఁడవు. సర్వమును భస్మావశేషముగఁ జేయు

శక్తుఁడవు. నిన్నా బ్రహ్మచారిగాఁడు భస్మావశేషునిగాఁ జేసెద నని బెదరించుటయు దానికి నీవు బెదరుటయు నాశ్చర్యముగా నున్నదే !

మహేం—అది నమ్మఁతగినట్లు కనఁబడదు.

అగ్ని—అమరాచార్యా ! నే నసత్యము చెప్పుట ... నా గుండె లెట్లు కొట్టుకొనుచున్నవో చిత్తగింపుఁడు.

మహేం—నీవసత్య మాడితివనికాదు. వానికంత తేజస్సు కలదా యని యుఁ గలిగెనేని యెట్లు లభించె ననియు నాయభిప్రాయము.

అగ్ని—బ్రహ్మచర్యంబువలనను లౌకికప్రచారమునుండి నివృత్తుఁడగుటవలనను అట్టిమహాతేజస్సు కలిగెనేమో.

బృ—ఆమాటల కేమిగాని నీవు మరుత్తునిసన్నిధికిఁ జేరినది మొదలు జరిగిన దంతయు సరిగా వచింపుము. దానినిబట్టి కర్తవ్యము నిర్ణయించుకొనెదము.

అగ్ని—మరుత్తుఁడు నారాక యెఱింగి ప్రత్యుత్థానము చేసి యాసన పాద్యార్ఘ్యాదుల నాదరించి నావచ్చినపని యడిగెను.

బృ—తరువాత. నీవేమి చెప్పితివి ?

అగ్ని—నేను సకలలోకసామ్రాజ్యాధిపతి యైనమహేంద్రునిదూతనని వచించితిని.

మహేం—అతఁడు భయభక్తులతో వార్త గ్రహించెనా ?

అగ్ని—జరిగినది వింటిరేని అది యంతయు మీకే విశద మగును. నేను వేఱ వచింపనేల ?

బృ—అతఁ డేమి వచించెనో ఆమాటలే యనువదింపుము.

అగ్ని—వానిమాటలే వచించెద. “మహేంద్రుఁ డని పేరుపెట్టుకొని మున్ను మానవసాహాయ్యమున దానవుల గెలిచి విజయశాలి

నని సంతోషించినాఁడు. నేఁడు దానవసాహాయ్యము నొంది మానవలోకముపై దండు వెడలి వచ్చుచున్నాఁడా యేమి? మానవమహాయాగదత్తసాజ్యవపాభక్షణమాంసలాలసుం డైన మహేంద్రునికి మానవులవయి దండు వెడలుట ధర్మమే. కాని మ్ము." అని యనెను.

మహేం—ఏమి వానిగర్వము!

బృ—తరువాత నీ వేమంటివి?

అగ్ని—మా మహేంద్రుఁడు మానవలోకముపై దండువెడలివచ్చుటకాదు. మన్ముఖంబున మహేంద్రుఁడువచించుమాటలు వినుమని యిట్లు చెప్పితిని. "మా కహితంబగు యాగాచరణము మానుము. మాయాజ్ఞ యతిక్రమించితేని మాకు శత్రువ వగుదువు. దానఁ గలుగుఫలము నీ వెఱుంగనిది కాదు."

బృ—దానిపై నతఁ డేమనెను?

అగ్ని—అనుటమాత్రమే కాదు. అతఁడు ప్రళయకాలమేఘగర్జనము గావించి యిట్లనె.

శా. సంకల్పించినయాగమున్ విడుతునే ♦ స్వర్గాధిపుం డిట్టు లే
శంక ల్లేకయ వార్తఁ బంపఁదగునే ♦ సంవర్తుఁ డధ్వర్యుఁడై
సంకల్పించినయాగరాజమును దా ♦ సాఁగించు సాంతంబుగా
జంక న్నీ బెదరింపుమాటలకు నీ♦సామర్థ్యముల్ గొర్తె లే?

మహేం—వజ్రముమాట మఱచినాఁడు కాఁబోలు! లేకున్న వానినోట నట్టిపలుకులు బయలువెడలునా? నీవు వజ్రాయుధప్రసంగము జ్ఞప్తికిఁ దీసికొనిరావలసినది.

అగ్ని—అయ్యో! అదియు నైనది. మహేంద్రుఁడు వజ్రాయుధధారి యై వచ్చిన నీవేకాదు జగంబు లన్నియు నొక్కటియైన నోపు

నే? ఈబలవద్విరోధము తెచ్చుకొనకు మని బోధించితిని.

బృ—ఆమాటపై నతఁ డేమనెనో యనువదింపుము.

అగ్ని—ఆతండు క్రోధఘూర్ణితనేత్రుఁ డై,

ఉ. మాటకు ముందు వజ్ర మను♦మాటలు పల్కెడు దానితోడ నే
చోటనొ కూరుచుండి యల♦సున్నపుతాలనొ గుల్లతాలనో
బీటలువాఱఁ జెక్కమను ♦ బింకపుమాటలు మానుమంచు నా
మాటలు చెప్పు మిందు్రకడ ♦ మాఱువచింపక పొమ్ము వేగమే.

అని నిర్భయముగాఁ జెప్పెను.

మహేం—సురాచార్యా! ఏమి వానిపొగరుఁబోతుఁదనము! వజ్రముఁ
నంతగాధిక్కరించినవానిని నేను క్షమించిననునావజ్రముక్షమింప
దు. అగ్నిహోత్రా! ఈవజ్రాయుధము పంపి వానితల ద్రుంచి
వైవకున్న వజ్రధరుఁ డనుకొనుట వ్యర్థ మగునుగదా!

అగ్ని—సంవర్తసంస్తంభినీవిద్యాసంరక్షితుఁ డగు వానియెడ వజ్రము
వ్యర్థమే యగునేమో.

మహేం—అదే వచ్చినచిక్కు. అందులకే కదా ఇన్నియత్నములు?

బృ—అగ్నీ! నీవుఁగూడ నట్టిమాట లాడుచున్నావా?

అగ్ని—సంవర్తతేజోమహిమం బెఱింగినవాఁడనుగాన నేననుచున్నాను.

మహేం—బృహస్పతీ! మీవానిమూలముననే మాకింతబాధవచ్చినది.

బృ—కావుననేకదా యాగము మాన నిష్టము లేదేని సంవర్తుని విడువు
మనియు నేనె యాగోపదర్శనము చేయుదు ననియు చెప్పు
మంటని. అగ్నిహోత్రా! ఆమాట చెప్పినావా?

అగ్ని—ఆమాటచెప్పుటచేతనే యాసంవర్తుఁడు నాపై మండిపడినాఁడు.

బృ—సంవర్తునిమండిపడుటకేమి? ఆమంట నేను చల్లార్చెదనులే. మ
రుత్తుఁ డేమన్నాఁడో చెప్పు.

అగ్ని—మరుత్తుఁడుమాత్రము మఱొకవిధముగా మాటలాడునా? వాని మాటలే వచించెదను.

బృ—చెప్పు చెప్పు.

అగ్ని—తే. స్వర్గపాలుఁడు నీవును ♦ సములు నాకు
నన్ననోటనె మర్త్యుఁ డీ ♦ వనుచు నన్ను
ద్రోహ మొనరించి గురుఁడు నన్ ♦ ద్రోచివుచ్చె
నతనిమాటలు సెవిఁబెట్ట ♦ నర్హమగునె ?

అని పల్కఁగా నీవు గురువాక్య ముల్లంఘించిన గురుద్రోహి వగుదు వనికూడ నాడినాను.

బృ—దాని కతఁ డేమిసమాధానము చెప్పెను ?

అగ్ని—" శిష్యద్రోహము చేసినగురుఁడు గురుఁడే ? అట్టివానిమాట వినకుంట గురుద్రోహము కాదు. అది యటుండ,
తే. ద్రోహ మొనరించి గురుఁడు నక్ ♦ ద్రోసివైవ
శరణ మైనట్టిసంవర్త ♦ గురుని వీడ
ద్రోహ మగుఁగాదె సద్గురు ♦ ద్రోహి నగుచు
సకలసామ్రాజ్య మందుట ♦ సరళ మగునె ?
నీవే యాలోచింపు.
తే. మంత్రసామర్థ్యమున నీశ ♦ మహిమ దెలిపి
తత్ప్రసన్నత మితిలేని ♦ ధనము గూర్చి
సర్వతంత్రంబు నడపెడు ♦ శ్రౌతకర్మ
ధుర్యు సంవర్తు విడనాడ ♦ ద్రోహ మగును.
దివస్పతిబృహస్పతులప్రసన్నతచే నాకు గల్గువిశేషలాభ మే మున్నది ? అమర్త్యాచార్యుం డమర్త్యనాథునిచేతనే యాగంబు చేయించుఁగాక! మర్త్యజాతివానితో వానికిఁ బనియేమున్న

ది ? " అని మరుత్తుఁ డన్నాఁడు.

మహేం——బృహస్పతీ! నాయమరాధిపత్యము నీయమరాచార్యత్వముఁ గూడదీనితోఁ దుడిచిపెట్టుకొనిపోయినవి. మానవులే మనల నింతగా నవమానపఱచినచో మనమాట యింక నెక్కడఁజెల్లును?

బృ——చివరకంటఁ జెప్పనిమ్ము. దీనికిఁ బరిహార మాలోచింపలేమా? అగ్నీ ! తరువాత మతే మనెను ?

అగ్ని——అనుట కేమున్నది ?

తే. ఆపదను నన్నుఁ గాచిన♦యాప్తుఁ డితఁడు
ధనము మితిలేక యిచ్చిన♦దాత యితఁడు
గోప్యమంత్రంబు దెల్పిన♦గురుఁ డితండు
వీని విడుచుట ద్రోహమౌ ♦ వేయుగతుల.

అని సంవర్తునిఁ జూపుచు మరుత్తుఁ డనుటయు నాకు మాఱు మాటాడ నవకాశ మీయకుండుటయుఁ జూచి ప్రక్కకుఁ దిరిగి నెమ్మదిగా మరుత్తమానవనాథా ! సంవర్తుని నమ్ముకొని సకల లోకసామ్రాజ్యాధిపతితోను తద్గురూత్తమునితోను బలవద్విరోధము తెచ్చిపెట్టుకొనుట నీతియే యని యనుచుంటిని. అంతలోఁ బ్రళయకాలపుష్కలావర్తకరీతి సంవర్తుఁడు గర్జించి,

తే. నరు లొసంగినహవ్యంబు ♦ సురల కిచ్చు
మోఁతకాఁడవు దౌత్యంబు ♦ మోసినావు
మనుజపతితోడ బెదరింపు♦మాట లేల
నోరు మూయుము మాటాడ ♦ నుగ్గొనర్తు.

మహేం——హవ్యవాహన! ఎంతమాటాడినాఁడు! బ్రాహ్మణుఁడు గాన బ్రతికిపోయినాఁడు గ్లాని లేకున్న ఈపాటికి వానిబ్రతు కేమిగా తలసినదో.

అగ్ని—మహేంద్రా! ఆతఁడు సామాన్యుఁడు కాఁడు.

తే. ఏమితేజంబొ! స్మరియింప • నిపుడుఁగూడ
నొడలు వడఁకెడు నుదుటికి•నడుమ నతఁడు
కోటిసూర్యప్రకాశంబు • గూర్చి నవఁగ
నిఖలదైవశక్తిఁ దా • నిలిపె నపుడు.

బృ—అది చూచి నీవు భయపడితివా? అవి యన్నియు యోగుల మాయలు. యక్షిణీవిద్యలవంటివి.

అగ్ని—గురువరా! ఆమహాత్మునియెడ నట్టిమాయలుగాని యక్షిణీ విద్యలుగాని యున్నట్టు తోఁపదు. ఆబ్రహ్మవర్చస్సు చూడ ననలలోచను మించినవాఁ డని యనకతప్పదు.

బృ—అమరాధిపా! అనలునకు ననలలోచనుని మించినవాఁ డనితోఁ చినఁ దోఁచుఁగాక. ఆభిచారికహోమంబు గావించి యరక్ష ణంబులో నాతని హతతేజుని గావించెద.

అగ్ని—ఆతనియెడల నీయాభిచారికహోమంబులు వ్యర్థంబు లగును. దయాసత్యశౌచాదిదూరు లగుదానవు లనుకొంటివా? నీయ మోఘాభిచారమంత్రశక్తులు వానిదరిఁ జేరలేక యెదురు నిన్నే కొట్టునేమో! ఆలోచించి ప్రయోగింపుము.

బృ—అగ్నీ! యోగిమాయావిశేషంబున నేదియో తళుక్కుమను పైపై వెలుఁగు వానిమొగమునఁ జూచి భయపడి, వాని నొకగొ ప్పగాఁ జెప్పుచున్నావు. అంతియే కాక యమరాచార్యుఁడ నగు నాగౌరవము హెచ్చిన మగునట్లు మాటలాడుచున్నావు. ఇదిగో! నామంత్రశక్తి నీకు రుచి చూపించెదను చూడు.

అగ్ని—(కొంచెము భయముతో) మీమంత్రశక్తులు నావంటిసంసార

బద్ధునియెడల నమోఘములే. సంసారమార్గాతివర్తి యగు సంవర్తునియెడల నీయాటలు సాఁగవు.

మహేం.—అగ్నీ! మిగుల శ్రమపడినావు. ఒక్కనిమేషము నిలిచి మరుత్తునియెడఁ బ్రజానురాగ మెట్లున్నదో నీవెఱింగినంత దెలుపుము. భేదోపాయము వానియందుఁ బ్రయోగింపఁదలంతు.

అగ్ని.—అది అసంభవము.

ఉ. క్షామము రోగజాలము న•కాలపుమృత్యువు నీతిబాధలున్
భూమి ఫలింపకుంటయు న•పుణ్యపుబుద్ధులు లేక యెల్లరున్
క్షేమముతోడ నుండి నృపు•సేమము గోరుచునుంద్రు గాన నా
భూమివిభుప్రజావళుల•పొత్తు విరోధి కభేద్య మెన్నఁడున్.

మఱియు,

చ. జనకునిబోలె బాలురను • సద్గుణవిద్యల నేర్పఁజేసెమం
దనయులఁ బోలెఁ బెద్దల ను•దారవిధంబున సేవసేయుఁ దా
ననుజులఁ బోలె భృత్యుల స•మాదరణంబునఁ జూచు నెల్లరున్
మనమున దైవ మాతఁ డని • మన్ననసేయుదు రామరుత్తునిన్.

తే. తపమునందున ధనమున • ధాన్యమందు
షష్ఠభాగము నిచ్చుట • శాస్త్రవిహిత
మైనఁ దమకున్నసంపద • లన్ని విభున
కర్పణముసేయ సంసిద్ధు • లవనిఁ బ్రజలు.

తే. మును మరుత్తుఁడు దిగ్జయ•మునకుఁ బోయి
శత్రురాజుల నణఁగించి • శత్రుదేశ
జనుల బాధలఁ బెట్టక • శౌర్యగరిమఁ
బ్రజలు వరియించి రాతనిఁ • బ్రభువు గాఁగ.

తే. చతురుపాయంబు లెంతటి•చతురు లైన
నడుపఁజాలర యాభూమి•నాథునెడల

ఊర్ధ్వలోకంబుఁ బాతాళ ♦ మొక్కటైన
నమ్ము నామాట సత్యంబు ♦ నాకరాజ!

అయినను ఆలోచించుటకు దేవమంత్రి కలఁడుగదా! నాకు సెల విమ్ము.

మహేం—అగ్నిహోత్రా! మంచిది. (అగ్ని నిష్క్రమించును.)

మహేం—బృహస్పతీ! మా కాచార్యుండవు. మఱియు నమాత్యుండవు. ప్రకృతవిషయమున ఇతికర్తవ్యము నిర్ణయింపుము. సామయత్నము సఫలము కాలేదు. మహాదేవానుగ్రహోపార్జిత మహాధనసంపన్నుఁడైనవానియెడ దానయత్నంబు ధన్య మగుట కవకాశము లేదు. బ్రహ్మతేజోబలసంరక్షితుఁడగువానియెడ దండము చండతరంబుగ నుపయోగించిన నపాయము వాటిల్లు. భేదోపాయప్రయోగమునకుఁ గూడ నవకాశము లే నట్లే యున్నది. కాని భవదీయమేధాబలమున భేదోపాయప్రయోగావకాశము గనిపట్టవలయును.

బృ—మహేంద్రా! నీ వంతభయపడ నక్కఱ లేదు. అగ్నిహోత్రునిమాటలనుబట్టి చూచినను సంవర్తుఁడుగదా సర్వతంత్రము నడపవలసినవాఁడు. సంవర్తునకు సర్వతంత్రస్వతంత్రత లేదు. అతఁడు క్రత్వాచరణంబున నకృతాభ్యాసుండు. మంత్రలోపతంత్రలోపము లెన్నియో జరుగును. ఆయాగమునకు సిద్ధి యెట్లు కలుగు? న న్నాహ్వానించి సదస్సులోఁ గూర్చుండఁ బెట్టె నప్పు డూరకుందునా! కర్మప్రయోగము భ్రష్ట మైనదని చెప్పి క్రతువు సాంతము కాకుండఁ జేసెద.

మహేం—అమాత్యా! నీ వాచార్యభావంబునఁ జెప్పుచున్నావు. అది అటుండనిమ్ము. మంత్రిభావముతోఁ క్రత్వారంభమే కాకుండఁ

జేయునుపాయ మన్వేషింపుము. సంవర్త మరుత్తులసహవాసము చెడఁగొట్టవలయును. అధమపక్ష మేవ్యాజముననైన వారల నిరువుర నెడఁబాపితిమా, మనకు విజయాశకలదు. లేదా హతాశులము గావలసినదే.

బృ—మహేంద్రా ! మంచిది. మరుత్తునిమర్మ మెఱిఁగి మాసంవర్తునితో విడఁదీయుట యేకాదు. మరల సంవర్తునిసాన్నిధ్యమున కవకాశము లేకుండ మహాయుద్ధ మేదేని కల్పించి మరుత్తుని మరణమొందించు మహోపాయ మొకటి కనిపట్టవలయును.

మహేం—మనకది మఱియునుమంచిది. మనము స్వయముగా మానవజాతివారినిఁ బ్రతిఘటించి యుద్ధముచేసినచో మానవజాలికి మనపై ద్వేషభావము కలుఁగవచ్చును. మనయాజ్యభాగంబులకును హవిర్భాగంబులకు నేమి యడ్డు వచ్చునో. వృథాగా నోటికడకూడు పడఁగొట్టుకొనుట భావ్యము కాదు గదా. పరులఁ బురికొల్పి మరుత్తుని మరణింపఁజేయునుపాయ మాలోచింపుము.

బృ—(పైకిఁ గ్రిందికిఁ జూచి ఆలోచించి తలయూఁచి) అమరాధిపా! అగ్నిహోత్రుని మాటలనుబట్టిచూచిన యమోఘమైనయుపాయ మొకటి తోఁచుచున్నది.—చక్కనియుపాయ మొక్కటి తోఁచినది. (అని తలయూఁచును.)

మహేం—మంత్రివరా ! ఏమి యాయుపాయము? అంత యమోఘమయినదియా ?

బృ—అమోఘము ననపాయము నైనయుపాయము.

మహేం—నామనము విన మిగులఁ దహతహపడుచున్నది. సెలవిమ్ము. అగ్నిమాటలనుబట్టి అట్టిది స్ఫురించుట కవకాశ మేమున్నది ?

బృ—ఊర్ధ్వాధోలోకంబులొక్కటియైన నుపయోగము లే దసి గదా

అగ్ని వచించినాఁడు. ఇప్పు డూర్ధ్వాధోలోకంబు లొక్కటియ గుటయే వానిఁ జిక్కఁడఁచుటకుఁ జిక్కనియుపాయము.

మహేం—మన కది యెట్లు సాధ్య మగును.

బృ—(ఆలోచించున ట్లభినయించి) నాకుఁ గొన్ని సందర్భములు స్ఫురించినవి. వాని కన్నియు ననుకూలముగా నున్నవా లేవా? అని దివ్యదృష్టితోఁ జూచుచున్నాను—ఆఁ! ఆఁ! బాగుబాగు. విను. అధోలోకవాసులగు నాగులను మనము వశపఱచుకొనినచో అది సుసాధంబగు. మఱియు ఔర్వాశ్రమంబున మరుత్తునిపితామహియగు వీరమహాదేవి వానప్రస్థము జరుపుచున్నది. ఆయాశ్రమంబుననే నాగజాతివారు కొంద ఱెట్లో చెదరి వచ్చి నివసించుచున్నారు. ఆనాగులకును యోగులకును విరోధము కల్పించి నాగులవలన యోగులకు బాధ కల్పించితిమేని బాధ కలిగించుటయే గాదు చంపితిమేని నాగులను శిక్షింప మరుత్తపితామహి రాజగుమరుత్తునకు సందేశ మంపును. ఆసందేశము వినినవెంటనే మరుత్తుఁడు సంవర్తుని విడనాడి యాయాశ్రమంబునకుఁ బోవకమానఁడు. ఆతఁడు రాజధర్మము దాఁటెడువాఁడు గాఁడు.

మహేం—సంవర్తునిదరినుండి మరుత్తుని విడఁదీయుట కిది చక్కనియుపాయమే. ఏదియో కారణమునఁ గయ్యము కల్పించుకొని వానిని ఖండఖండములుచేయ వజ్రాయుధ మంపెదను. కాని నాగులకును యోగులకును విరోధము కల్పించు టెట్లు?

బృ—అది యెంతపని! యేదియో యొకమిష పెట్టి కలహము కల్పింపఁగలను.

మహేం—ఒకవేళ, మరుత్తు నట్లు విడఁదీసినను, మనమే స్వయముగా

మానవునిపై నస్త్రప్రయోగము గావించిన మానవులకు మన
పై భేదభావము కలుగు నని యింతదాఁక సందేహించితివిగదా.
దాని విషయమున నీయభిప్రాయమేమి?

బృ—మానవునిపై వజ్రాయుధప్రయోగముచేయ నావశ్యకతయే లే
దు. మరుత్తుఁడు సంవర్తుని మరలఁ గూడకుండుట గదా కావ
లసినది. మరుత్తుఁడు మరల వచ్చులోపల సంవర్తుఁడు విసుఁగు
పుట్టి యే క్షేత్రమునకైనఁ బోవచ్చును. అతఁ డాదినే పిచ్చి
వాఁడు స్థైర్యము లేనివాఁడు.

మహేం—అవును గాని, ఒకవేళ నల్పసంఖ్యాకులగు నాగుల హింసించి
మరుత్తుఁడు మరల సంవర్తుని గూడినచో మనమనోరథము విఫ
లమగుటయే గాక మన కపటోపాయము బయలుపడిపోవునే
మో? అప్పుడు పలువురు మనలఁ బరిహాసింతురు.

బృ—ఆఁ! యెంతమాట! అల్పసంఖ్యాకు లని వారల హింసించుటఁ
యలవి యగునా? అతఁ డానాగజాతివారిని హింసించె నేని
నాగలోకమువా రండఱును దిరుగఁబడు నట్లు ఏర్పాటు గావిం
చెదను.

మహేం—మనకై నాగలోకవాసులు వృథాగా కలహమునకుఁ గాలు
దువ్వెదరా?

బృ—వారికిఁ జెప్పఁదగినట్లు చెప్పుటయే కాక ముందుముందు కొన్ని
కొన్నిహవిర్భాగాది లాభములు గలిగించెద మని ఆశపెట్టవల
యును. దానితో మనమాటలకు లొంగనివా రుండరు. ఊ
ర్ధ్వలోకవాసులకును అధోలోకవాసులకును మధ్యమున నున్న
మానవుని ఊర్ధ్వాధోలోకవాసు లుభయులును గలసి అఱచేతు
లనడుమ నున్నయప్పడంబుఁ బోలె నలిపివేసిన నుభయులకును

లాభ ముండును.

మహేం—అమతామాత్యా! మంత్రి యనిన నీవే మంత్రివి. మంచి యాలోచనఁ గావించితివి. ఈయుపాయంబున మధ్యమాధో లోకవాసులకు మానసిపోరు పడును. మనము పైని విమానము లోఁగూర్చుండి చూచుచుండవచ్చును. (ఆలోచించి) కాని నాగ లోకవాసులందఱును తోఁకఁ జాడించువారే కాని ధీరతఁ బోర నిలఁబడువా రొక్కరైన లేరు. వారికి వినిపించినఁ గనిపింపదు. కనిపించిన వినిపింపదు. వారు పరాపేక్షులు. వారిపక్షమున మఱియొకని నెవని నైన మరుత్తునిఁ బ్రతిఘటింపఁ బ్రేరింపవలయు. అతఁడు మరుత్తునితో సమానుఁడో మరుత్తునిపయివాఁడో కావలయును. ఆలోచింపుము. నీబుద్ధికి వశము గాని దేమున్నది.

బృ—నాబుద్ధి కేమి? నావి వట్టికల్పనలే గాని యవి యాచరణమునఁ బెట్టునపుడు గలుగు సాధకబాధకసందర్భములు ప్రభు వగు నీకు స్ఫురించినట్లు నాకు స్ఫురింప లేదు. నాగులు పరసాహాయ్యమునఁ గాని నిలఁబడలేరు. నీవన్నట్లు మరుత్తునిపయివాని నే నాగపక్షమున లేవఁదీయుట యావశ్యకము.

మహేం—మరుత్తునిపయివాఁ డెవఁడు గలఁడు?

బృ—(ఆలోచించి) మరుత్తునితండ్రియే కలఁడు. అతఁ డసహాయశూరపౌరుషనామధారి. అవేక్షితాభిధేయుఁడు.

మహేం—అతఁడు మాటకు ముందు ప్రతిజ్ఞ చేసి బాధలు పడుచుండెడువాఁడేకదా. కాని గట్టివాఁడు. అతని పట్టుదల వెఱ్ఱిపట్టుదల.

బృ—అవు నవును. అదియే మన కిప్పు డుపయోగించును.

మహేం—అది యెట్లు?

బృ—నాగుల రక్షింపఁ బ్రతిజ్ఞ చేయించితి మేని "వజ్రం వజ్రేణభిద్యతే" అను నట్లు తండ్రియుఁ గొడుకును గొట్టుకొని చచ్చెదరు.

మహేం—అతఁ డట్టిప్రతిజ్ఞఁ బట్టునట్లు చేయఁ గలమా?

బృ—అదియు నాగులమూలముననే జరుగ వలసియున్నది.

మహేం—అది యెట్లు?

బృ—మున్ను మరుత్తునితల్లి యగుభామిని మరుత్తునితండ్రియగు నవేక్షితునికై తపము చేయునపుడు భామినితపోమహిమకు సంతసించిననాగులు ఆమె కమూల్యాభరణాదులును అమృతాహారము నర్పించినారు. ఆమె తనకృతజ్ఞతఁ జూపఁ దగినప్రత్యుపకార మేమి చేయుదు నని యడుగ "నీకుమారుఁడు చక్రవర్తియై సామ్రాజ్య మేలునప్పుడు మాకుఁ గావలసిన సాహాయ్య మొనరింతువు గాక" అని వరము పుచ్చుకొని యున్నారు. ఆనాగులు భామినికడ కేగి నాగకులరక్షణము గావింపు మని కోరినచో ఆమె భర్తచే నాగరక్షణప్రతిజ్ఞ చేయించును. మరుత్తుఁడు తా జధర్మరక్షణార్థము నాగులఁ జంపఁ బూనినపుడు వానితండ్రిని దగిలించితిమా పితాపుత్త్రులలో నొకఁడు పెద్దలలోఁ గలియవలసినదే. అందులోఁ గొడుకు గుఱ్ఱవాఁడు గదా! హాయిగా మనము విమానముమీఁదఁ గూర్చుండి చూడవచ్చును.

మహేం—ఇంక మనమనోరథము నెఱవేఱిన దన్నమాటే. ఈదెబ్బతో మరుత్తుఁడు మన్నయిపోవలసినదే. మనకు మరుత్తబాధ మరలిన దన్నమాటే.

బృ—కావుననే కదా, మరుత్తునికిని వానికిని మహాయుద్ధము కల్పింప నెంచితిని.

మహేం—నీమేధావిశేష మనుపమానము. కాని మనకపటోపాయమును

మాత్రము బయలుపడకుండ మనము చూచుకొనవలయును.

బృ.—దానికిఁ గావలసినకట్టుదిట్టములు నేను జేసెదను. ఒకవేళ బయలుపడినను మనకు భయమేమి? “విషస్య విష మౌషధ” మన్నట్లు శత్రువిషయమున నట్టిభేదోపాయప్రయోగము సేయుట నీతిసమ్మతమేయందరు. మనల నడుగువాఁ డెవఁడయ్యా! అడిగినచో నేను సమాధానము చెప్పలేనా? నాపేరే వాచస్పతిగదా!

మహేం.—తుదికేమయినను సంవర్త మరుత్తులను మరలఁ గలియనీయరాదు. సంవర్తుఁడు మరుత్తున కిదివఱకే మహామంత్రతంత్రము లుపదేశించె నేమో? మరుత్తుఁడు వానితండ్రికిఁ గూడ సాధ్యుఁడు కాకపోవచ్చు.

బృ.—ఏమి నీవెఱ్ఱి! సంవర్తుఁ డెంతవాఁడు? మొదటనే పిచ్చివాఁడు. ఒక్కయాభిచారికహోమము గావించి యొకశక్తిని బంపితినా అది వాని నేమహారణ్యములోనికో కొనిపోవును. మఱియును ఇదివఱ కాతఁ డుపదేశించినవి ఫలియింపకుండఁ జేయును. ఆపని చేసియే తర్వాత మఱియొకపని చేసెదను. ముందు జపహోమాదులకు సామగ్రి సిద్ధపఱుపుము.

మహేం.—అమాత్యవర్యా! అవి నమ్మి యుండవలదు. అవి యదృష్టఫలితములు. వానికై కాలక్షేపము సేయక శీఘ్రముగ నాగలోకమున కేగి పన్నగులయెడఁ బన్నవలసిన పన్నాగములు పన్ని సన్నాహ మంతయుఁ జేసి రమ్ము. ఆవశ్యకమైనచో నాపేరు చెప్పి వారికి ధైర్యము గొలుపుము. వజ్రధారినై విమానముమీఁద నుండి వారిని గనిపెట్టుచునే యుందు నని చెప్పుము. త్రిటికాలమైనఁ దోవలోఁ గాని ఇక్కడఁ గాని

వ్యర్థముసేయక సంకల్పితకార్యమునకు సన్నాహము సేయుము.

బృ—(విసిఁగికొని) చిత్తము. మీసెలవుప్రకారమే చేసెదను. ఇక్కడనుండియే ముందు భూలోకమునకు వెడలెదను. (తనలో) వీనికి న్లౌకికమంత్రమందే విశ్వాసము కలదు గాని నావైదికమంత్రమందు విశ్వాస మున్నట్లు కనఁబడదు. వేదవిశ్వాసదైవవిశ్వాసములు లేనివాని కెన్నిబలములున్న నేమిలాభము. ఆహా! అభిచారికహోమము అదృష్టఫల మఁట. అది చేయుట కాలక్షేపకారణ మఁట. మాఱుమాటాడితి నేని మనలో మనకే భేదమా? లేనిపోని వాదమా? అనును. పోనీ! నా కేమి? ఇంద్రుఁడు చెప్పినట్లే చేసెదను. నాయనుజునిపై నున్న యాగ్రహము గూడ న న్నిష్టములేనిపనికి నీడ్చుచున్నది కదా! లౌకికమంత్రమున శక్తివంచన లేకుండఁ బ్రయత్నించెదను.

(నిష్క్రమించును.)

మహేం—మరుత్తుఁడా మహాయోధుఁడు. సంవర్తుఁడా సామాన్యుఁడు గాఁడు. మనయమాత్యుఁడు మహామేధాశాలి. పన్నినపన్నగడ బాగుగా నున్నది. పన్నగములమూలమున ఈపన్నాగము ఫలింపవచ్చును. కొంచెమైనవ్యత్యాసము గలిగి కపటోపాయము బయలుపడె నేని లోకద్వయమువారు నొక్కటియగుదు రేమో? (విసుఁగుతో) సంశయాత్మకు సంపదలు దూరమగును. ఇట్లు సంశయించిన నంతయు సంశయమే. ఊఁ. అప్పటిమాట చూచుకొనవచ్చు. అన్నిటికిని బృహస్పతియే పూనుకొని యున్నాఁడుగదా. నందనవనమున కేగి కొంచెము విశ్రమించెద. (నిష్క్రమించును.)

---



# శ్రీ
# మరుత్తరాట్చరిత్ర.

## చతుర్థాంకము.

### విష్కంభము.

వృద్ధముని.--(ఔర్వాశ్రమంబున సంచరించుచుఁ బ్రవేశించి) కరంధముఁడు వానప్రస్థాశ్రమము గడపిన యాశ్రమముననే యిట్లున్నదే ఇతరాశ్రమములయం దెట్లున్నదో? ఈకాలమునుబట్టి యన్నియాశ్రమములలోను గూడ నిట్లే యుండు నేమో? కటకటా! కానికాలము వచ్చినది. ఇట్టిదుష్కాలమున నింకను బ్రదికియున్నాను. ఈ పాడుకన్నులతోఁ జూడవలసిన దంతయుఁ జూడక తప్పునా? ఈ పాడుచెవులతో వినవలసిన దంతయు వినక తప్పునా? ఇంతజాతిద్వేషమా? నాగజాతికి మానవజాతిపైని, అందును బ్రాహ్మణజాతిపైని కలిగినద్వేషము ఇంతింత యనిచెప్ప శక్యము గాదు. నాగజాతి కిది యేమి దుర్బుద్ధి పుట్టినదో గాని చెఱువు లన్నియు విషపూరితంబులు గావించె—ఆహారపదార్థము లన్నియు అందును ఫలోపయుక్తపదార్థము లన్నియు విషదూషితంబులు గావించె. తినుటకుఁ దిండియుఁ ద్రావుటకు నీరును గూడ లేకుండఁ జేసి మానవజాతిని అందును బ్రాహ్మణజాతిని నశింపఁజేయఁ బూనినట్లు గనఁబడుచున్నది. ఇట్టి మహోపద్రవమునకుఁ బరిహారము గ

ల్పింపకుండ భగవంతుఁ డూరకుండునా? నాగజాతివారికిఁ గోపము గలుగుటకుఁ గారణము, మానవజాతిలో నొకజాతివా రగుబ్రాహ్మణజాతివారు చేసినతప్పఁట! అదియఁట! భగవత్తత్త్వము తెలిసికొన నాగపూజ సాధనము గాదనియు యోగమో జ్ఞానమో ముఖ్యసాధనమనియు బోధించుట యఁట! కటకటా! యిదియొకమిష. దీనికి మూలకారణ మేదియో యుండును. అది వెడలఁ గ్రక్కరు.

చ. చెలిమియు వైర మేర్పడును • జేసినకార్యముఁ బట్టి యొండొరుల్
ఫలితము గాఁగ సౌఖ్యములో • బాధలో పొందుట లోకనైజ మ
ట్టులు గనరాదు నేఁ డిటుఁ బ•టుత్వము గల్గినజాతు లన్యజా
తుల లయ మొందఁజేయుకుమ•తుల్ భువిఁబుట్టిరి యేమిమూఁడునో.

వీఁడు ముదుసలితనంబున నేమేమో వదరుచున్నాఁ డందురుగాఁబోలు. లేదా, వీఁడును మానవజాతిలోనివాఁడే. అందును బ్రాహ్మణజాతివాఁడు గాన నట్లు వదరుచున్నాఁ డని నాగులు నాకాల్ల కష్టపడి నన్నుఁ గఱవ రారుగదా! హా! దైవమా! యెంత యుపద్రవము సంభవించినది! ఇట్టిదేశోపద్రవముల నంతరింపఁజేయ వలసినవాఁడు దైవము. తర్వాతఁ బ్రత్యక్షదైవ మగురాజు.

ఉ. రాజు సమస్తజాతులప•రస్పరవైరముఁ బాపుత్రోవ ను
త్తేజితబుద్ధిఁ ద్రొక్కి జగ•తిం గలజాతుల నెల్లఁ బ్రేమవి
భ్రాజితసౌహృదంబున వి•రాజిలఁజేయుట యొప్పుఁ గాని మా
రా జిటు సూడఁ దైహికప•రత్వముచేతనొ యాగదీక్షనో.

(తెరలో) ఆఁ! ఆఁ! ఎంతమాటాడుచున్నావు.

వృద్ధ—(తనలో) ఎవరో యెంతమాటాడుచున్నా వనుచున్నారు. అప్పుడే రాజద్రోహ మయిపోయినది గాఁబోలు? పాములకాటుతోఁ జచ్చుచున్నపుడు "అయ్యో! పాప" మని కనికరపుమాట నైన

కనువాఁడు లేఁడు గాని మీరా జిటు సూడఁ డని యనుకొన్నంత మాత్రముననే నన్ను నను నను చెఱసాల కందురు గాఁబోలు. పోనీ! అదే మంచిది! ఇక్కడిసర్వబంధసర్పదంశములకంటె అక్కడినిగళబంధమశకదంశములే కొంతనయ మేమో? అక్కడఁ బ్రాణములతోఁ బ్రతికి నైన నుండవచ్చును. "జీవన్ పశ్యతి భద్రాణి" అన్నట్లు బ్రతికియుండినచో నెప్పటికైనను మంచికాలము కన్నులఁ బడఁగూడదా! "బ్రతికి యుండిన శుభములఁ బడయవచ్చు" అన్నమాటనమ్మికొని యుందు. నేఁటినుండియు నాతోపాటు నాపితృదేవతలకుఁగూడఁ బస్తే. ఏమి చేయను.

రాజభృత్యుఁడు—(ప్రవేశించి) రా జిటు సూడఁ డనుకొన్నావా?

వృద్ధ—నాయనా! రాజభృత్యా! నేను తప్పుభావముతో నన లేదు. నన్ను నిష్కారణముగా హింసపెట్టకుము. నేఁడు మాతండ్రిగారి యాబ్దికము. సర్వవిషదూషితముగానిపదార్థము దొరకక యిట్లు దేవులాడుచున్నాను. దానికిఁ దోడు నన్నుఁ జెఱసాలకుఁ బంపితివేని శ్రాద్ధ మే చెడిపోవును. నీధర్మమా యని మంచిపదార్థములు దొరకినచో మాయింట వండుకొనుమాషచక్రములు నీకుఁ గడుపునిండఁ బెట్టించెదను లే.

రాజభృ—నేను లంచము పుచ్చుకొనువాఁ డననుకొన్నావా?

వృద్ధ—(తనలో) రాజభృత్యులకు లంచము లిచ్చిన నొకతంట; యీయకున్న నొకతంట. వీరిలోఁ గొందఱుపైకిఁ బెద్దమనుష్యులవలె నటింతురు. కొందఱు లంచములు నిషేధించుటగూడ నొకవిధముగా లంచ మిమ్మని కోరుటయే. వారిలోను పెద్దమనుష్యులు పెక్కండ్రున్నారు. వారిమనసు కనిపట్టుట కష్టము. అయినను, ఇట్లు చెప్పి చూచెదను. (పైకి) గారెముక్కలు లంచ మగునా? మీ

కట్టినం దేహ మేల?

రాజభృ—గారెముక్కలైనను గాంచనపుముక్కలైనను సమానమే.

వృద్ధ—(తనలో) అదియుఁ దప్పే యైనదా? (పైకి) రాజభృత్యా! నీ వన్నట్లు మాపచక్రములైనను గాంచనచక్రములైనను సమానమే కాని యుపకారము నొందినవారు సంతోషపూర్వకముగా ఇచ్చినది పుచ్చుకొని సంతోషించినచో అదిలంచ మనిపించుకొనదు. ముందే యింత యని నిర్ణయించుకొని చావఁగొట్టి చెవులును లిపి నిలఁబెట్టి నిమిషములమీఁద నిర్ణయప్రకారము నియమితముగాఁ బుచ్చుకొన్నది లంచమనిపించుకొనును. కావుననే కడుపునిండ గారెలు పెట్టించెద నని నిర్ణయశూన్యముగానంటిని. ఇది పుచ్చుకొనుటవలన మీకును దప్పు లేదు. మాకును దప్పు లేదు.

రాజభృ—అవి యన్నియు మా కెందుల కయ్యా!

వృద్ధ—మమ్మును మాగౌరవమును గాపాడుట కయ్యా.

రాజభృ—మిమ్మును మీగౌరవమును గూడఁ గాపాడుటకు మహారాజే వచ్చినాఁడు.

వృద్ధ—అలాగుననా? ఆపదలో నున్నాము. మంచిమాట చెప్పినావు. నీ కే మిచ్చిన నీఋణము తీఱును నాయనా? ఆమహారాజు రాఁబట్టియే కాఁబోలు నేఁడు నాగబాధయే గాక నాగదర్శనము గూడ లేదు. లేకపోయినచో, అమ్మయ్యో! ఇంతసేపు ఇంతనిర్భయముగా మాటలాడుచు నిలఁబడఁ గలమా? ఈపాటికి నాగులు కన్నుబుస్సు మనుచుఁ గాల్లఁ గస్తుపడకుందురా?

రాజభృ—యోగీశ్వరా! మున్ను నాగులు మానవజాతియెడ నణఁగి మణఁగియుండెడివారే. అందును విప్రు లన్న, విశేషవిధేయతతో నుండెడివారు. ఒక్కొకప్పుడు నాగులు యోగులు వావివరుసలతోఁ

బిలిచికొనుచుఁ గలసిమెలసి యుండెడివారు. అట్టిసామరస్యము నె
డ నేఁ డింతదౌర్జన్యమునకు దిగినారేమి?

వృద్ధ—ఏమో నాయనా! నిజ మెవరికిని దెలియదు. కాని ఈనడు
మ బృహస్పతి పాతాళలోకవాసులఁ గొందఱ వెంటఁ బెట్టుకొని
స్ఫటాటోపముతో నర్ధరాత్రమున మహారహస్యముగా వచ్చి వెంట
నే వెడలిపోయినాఁ డఁట. ఆమఱునాఁటియుదయమే ప్రారంభము.
నాగు లెగిరెగిరిపడుట, బుస్సుబుస్సు మనుట, విషము లుమియు
ట, కాళ్లకడ్డుపడి కఱవఁబోవుట, కొందఱను గఱచుట. ఏమిచెప్ప
ను మా యవస్థ. బృహస్పతియుఁ బాతాళవాసులును గలసి యే
మైనదుర్బోధనములు చేసినారేమో యని యనుమాన మున్నది.
అది పై కంటెమేని అమరాచార్యునితో విరోధము వచ్చును. అ
మరాధిపతి కాయన యంతే చెప్పిన నంతే కదా! దాన మొదటికే
మోసము వచ్చునేమో యని భయము. ఎవరితోను అనకుసు
మీ! నామాటలలో లేనిపోనియర్థములు కల్పించి చెప్పకుమా!
నానిష్కల్మషహృదయము కనిపట్టినావో లేదో? నీకడుపు నిండఁ
గంపెడుపిల్లలు పుట్ట! మహారా జెక్కడ నున్నాఁడో చెప్పు. ఆయ
నదర్శనము చేసినవారికిఁ బాపము లన్నియుఁ బోవును.

రాజభృ--రాజరాజపితామహియగువీరమహాదేవిపంపినసందేశము విని
వచ్చినాఁడు. తా నామెదర్శనమునకుఁ బోవుచు మీయాశ్రమవా
సుల కభయము దెలుపు మని నన్నుఁ బంపినాఁడు.

వృద్ధ—అలాగా! నాతండ్రితద్దినము తర్వాతనైనఁ బెట్టుకోవచ్చును
గాని మరుత్తమహారాజు పితామహితో మాటలాడుచుండఁగాఁ జూ
డవలె నని యున్నది.

రాజభృ—మీ కడ్డే మున్నది. దయసేయుండి! మరుత్తమహారాజు

మహారాజపితామహికి నమస్కరించుచున్నారము. చూడుండి!

వృద్ధ—సుదినము సుదినము. ఇంకను దగ్గఱగఁ బోయి చూతమురా!

రాజభృ—రండి! (ఇద్దఱునిష్క్రమింతురు.)

---

(మరుత్తుఁడును వీరమహాదేవియుఁ బ్రవేశింతురు.)

మరు—పితామహీ! భవత్పౌత్రుండనగు మరుత్తుఁడ నమస్కరించు చున్నాను.

వీర—పౌత్రా! దీర్ఘాయుష్మంతుఁడ వగుము. దేశ మారోగ్యసంపన్నమయి క్షాత్రధర్మానుగుణముగా నున్నదా?

మరు—మీయాశీఃప్రభావంబున నట్లే యున్నది. మీసందేశము విని వచ్చితిని. ఏమి యాజ్ఞ?

వీర—భవత్పితామహుం డగు కరంధముఁడు రాజ్యము సేయుకాలమున నిట్టి దేశోపద్రవకరంబు లగు జాతిద్వేషములు లేవు. మీతండ్రి కారణాంతరమున మొదట రాజ్యాధికారము నిరాకరించెఁ గాని యెట్లో నీకు రాజ్యాధికారవయస్సు వచ్చువఱకు రాజ్యముసేసెఁ గదా! అప్పుడు నిట్టి యుపద్రవములు లేవు. నీతండ్రిప్రోత్సాహముచేత నీవు యౌవనాగమసమయమందే రాజ్యాధికార మొంద వలసివచ్చినది. భోగాసక్తుఁడ వగునీవు చారవిచారదృష్టులతో సర్వదేశములఁ బరిశీలించి పరిపాలింపకుంటచే దేశమున సత్క్రియాదుర్వ్యవత్వము దానఁ బరస్పరాపహానము దానఁ బరస్పరవిరోధములును క్రమముగ జాతిద్వేషములును జనించినవి. నీకును సుఖము లేదు.

క. ఎందాఁక రాజ్యభారము

నందఁడవో రాజవ్యక్తులఁజుఁ దందాఁకనె తా

నతిసుమ గృహసౌఖ్యంబుల
నెందున్ రాఁ జొట దుఃఖమే కద పౌత్రా.

మరు—పితామహా! నేను భోగపరుఁడ నగుటచే నాశ్రితక్షేమము నరయుట శ్రద్ధసేయలేదు. యాగోద్యమంబున నవకాశము లేక కొంత యశ్రద్ధ గావించినమాట సత్యమే.

వీర—మరుత్తా! కారణమేమైనను ఫలిత మొకటియే గదా!

తే. స్త్రీలవలలను జిక్కి య • శేషభోగ
పరుఁడ వగుటయు యాగాది • పరుఁడ వగుట
రెండు స్వార్థంబులే రాజు • రెంటఁ దగిలి
ప్రజలసౌఖ్యంబు మఱచినఁ • బాపి యగును.

ఒకవేళఁ గ్రతుమహాసంరంభమున నున్నను చారదృష్టులఁ గనుపెట్టి చూచుచుండవలెను.

తే. పెద్దమైనను రాజు దాఁ • బిన్న దైన
నిహపరసుఖంబుల న్వీడి • యెఱుక గలిగి
చారదృష్టిని న్యాయవి • చారదృష్టి
నరయుచుండిన వాఁడె పో • యంధుఁ డనఁగ.

మరు—పితామహా! అంధున కంజనం బిడితివి. నీసందేశమూలమున నాశ్రమస్థితియెఱింగించి మావంశగౌరవమునిలఁబెట్టితివి. నాగజాతికి మానవజాతిపైని అందును విశేషంబుగా బ్రాహ్మణజాతిపై ద్వేషము గలుగుటకుఁ గారణ మేమియో తెలుపఁ గోరెద.

వీర—పౌత్రా! విశేషకారణ మేమియుఁ గనఁబడదు. సాధుజనుల బాధించువారికిఁ గారణ మొకటి యుండవలయునా? నిజ మగుకారణ మేదియో గ్రహింపఁ జాలను. వారు సెవ్వకారణాభాస మొకటి కనఁబడుచున్నది. అదే మాటేని—పండితశాపమనసామాన్య

ముగా మానవు లందఱును నాగులపుట్టదగ్గఱకుఁ బోయి పూజనే యుట యాచారముగా నున్నది. అందును పామదు లెక్కుముతో నముతోఁ బూజించుచుందురు. బ్రహ్మజ్ఞాను లగుయోగులుకొం దఱు “భక్తిజ్ఞానవైరాగ్యము లలవఱచుకొని సర్వవ్యాపకుఁ డగు పరమాత్మను ధ్యానించువారికి ముక్తి లభించును గాని పుట్టలోఁ బాలుపోసి పాములఁ బోషించి వానిఁ బూజించువారికి ముక్తిలభిం చునే.” అని బోధించి రఁట. దాన వివేకవంతులు పెక్కండ్రు నాగపూజ మానినా రఁట. ఆకారణమున మదిలో ద్వేషమునొం ది నాగజాతివారు క్రోధోద్దీపితులై సప్తర్షితుల్యు లగునేశ్వరయో గీశ్వరులఁ జంపినారు. జలాశయంబులు విషపూరితంబులు గావిం చి యాహారపదార్థంబులు విషదూషితంబులు సేసి మానవజాతిని మాపివేయఁ దలఁచిననాగజాతిని నశింపఁజేయుము. అందును బ్ర హ్మజాతి నశించెనేని లోకము లన్నియు నంధకూపప్రాయంబు ల గును జుమా!

మరు—పితామహీ! ఏది యెట్లున్నను నిష్కారణముగా నేశ్వరు హ తులైరి. వారు కేవలము మానవమాత్రులే కాక యోగీశ్వరులు గూడ నఱియున్నారు. గావున బ్రహ్మహత్య గావించిన నాగుల నశింపఁజేసెదను.

వీర—మరుత్తా! ఆయేశ్వరను జంపినవారల మాత్రము నంపి యూర కుండువా యేమి? దాన నధర్మ మాఁగదు. బ్రహ్మకులనాశము సేయుఁబూనిన నాగకులము నశింపఁ జేయుము.

మరు—పితామహీ! ఈహత్య నాగులు జాత్యభిమానముతోఁ గావిం చినదా? ప్రత్యేకవ్యక్తులయందలి కోపముతోఁ జేసినదా? యనియా లోచించుచున్నాను.

వీర—జాత్యభిమానపూర్వకమే. కాకున్నచో, మానవులు వాడుకొనుజలాశయము లన్నియు విషపూరితంబులు సేయుట యేల? ఆహారపదార్థములన్నియు హాలాహలదూషితంబులు సేయుట యెందులకు? నేను కరంధమునితో సహగమనము సేయక బ్రతికియున్న పాపఫలితము నేనున్నయాశ్రమములోనే యింతంతమహాఘోరములు జరుగుచుండఁగాఁ జూచుటయేకాఁబోలు. ఇందున్న యోగీశ్వరులుగాని నేనుగాని శపించినచో నీయస్త్రాపేక్ష మాకక్కఱలేదు. కాని, యీ తుచ్ఛకార్యమునకై తపోవ్యయంబు సేయ నొల్లము. ఆవశ్యకమైనచో నేను ఖడ్గము పూని యీయధర్మము నివర్తింపఁజేయఁగలను. వెనుక మీజననిస్వయంవరకాలమున మీజనకుని గొంద అన్యాయ్యముగా గుమిగూడి బంధించిరని తెలిసినపుడు మీతాత తాత్కాలికమంత్రులయభిప్రాయము ననుసరించి మీతండ్రిని జెఱనుండి విడిపించుటకు సామోపాయప్రయోగమునకై యాలోచించుతఱి నామనంబున నభిమానం బుప్పొంగ నాఁగఁజాలక నేనే ఖడ్గమూని మున నా కుమారు విడిపించుకొనెద నని ప్రతిన సేయఁబోవ మీతాత నన్ను నివారించి తానే దుష్టరాజుల సంహరింపఁ బ్రతిజ్ఞపూని యాదుష్టుల సంహరించి మీతండ్రిని విడిపించినాఁడు. అట్టివానిపౌత్రుఁడవైననీవు రాజ్య మేలుతఱి నేను ఖడ్గము పూనుట యనావశ్యకము ననుచితము ననియెంచి నీకు సందేశమంపితిని.

మరు—పితామహీ! ఎంతమాట! మీకును బ్రజలకును భృత్యుండనైననే నుండ మీకా కట్టెప్రయాస మేల? చూడు మిదె గారుడాస్త్రము ప్రయోగింతు.

ఉ. నాగకులంబు బ్రాహ్మకుల♦నాశము సేయఁగ బూని యేన్నుపిన్
యోగరతాత్ములన్ మునుల ♦ నుద్ధతిఁ జంపెను గారుడాస్త్రమున్
భోగులఁ ద్రుంపఁ బంపెదను ♦ భోగికులాంతము దప్ప దింక నా
భోగిశయానుఁ డేని యల ♦ భోగివిభూషణుఁ డేని వచ్చినన్.

తే. తల్లిదండ్రులమాట నే ♦ దాఁట నెపుడు
వారె నాగుల రక్షింపఁ ♦ బ్రతిన నట్టి
యడ్డవచ్చిన నాయస్త్ర ♦ మాఁప నొప్ప
సరకుసేయక గారుడా♦స్త్రంబ ! పొమ్ము.

చ. గరుడునిశక్తిఁ గైకొనుము ♦ గావఁగ మానవజాతి నస్త్రమా
చరచర నేగి యాకుటిల♦చారుల బ్రాహ్మణజీవహర్తలం
జరణనఖాగ్రతుండములఁ ♦ జంపుము నీ కెవఁ డేని యడ్డమై
తెరలక నిల్చె నేని గడ♦తేర్పుము వానిని నాయనుజ్ఞచే.

(తెరలో)

తే. వలదు వల దయ్య యస్త్రంబు ♦ వదల వలదు
కొంద అపరాధములు సేయఁ ♦ గులము నెల్ల
నాశనముసేయ న్యాయమే ♦ నాగజాతి
కభయ మిచ్చితి మాత్మజా ! ♦ యాఁగు మింక.

మరు—(తనలో) మాటవరుసకు నాతల్లిదండ్రు లడ్డవచ్చినను నాయ
స్త్ర మాఁప నని యంటిని. దైవవశంబున వారే నాయస్త్రమున
కడ్డవచ్చినారు. వారియెడఁ గలనాభక్తి మాపిఁతర్వాత నాయస్త్ర
ము విడిచెద.

(భామినియు నవేక్షితుఁడును ప్రవేశింతురు.)

మరు—జనకులారా ! నమో నమః. అస్త్రప్రయోగవినియుజ్యమాన

హస్తుండ నగుటచే శిరంబు వంచి వాగ్రూపంబున నమస్కరింతు. క్షమింపుఁడు.

అవే—దిగ్విజయోస్తు.

స్వామి—తథాస్తు.

మరు—జనకులారా! ధన్యుఁడనైతిని. ఏమి మీ సెలవు?

అవే—(వలదువలదయ్య అనుపద్యము పఠించును.)

మరు—అందఱుఁ జేసినను కొందఱే చేసినను జాత్యభిమాన పూర్వక ముగాఁ జేసినది గావున నట్టిభావము గల జాతి యంతయు దండ్య మే. అట్టిభావ మంతరింపఁ జేయుట కదియే సాధనము. ఆజాతికం తకు నట్టిభావము లేకున్న నాగలోకము నుండి నాగజాతివా రెల్లరు రా నేల?

అవే—నాగజాతివారి నన్యాయముగ నీవు బాధించునపుడు నాగజాతి వా రెల్లరు స్వజాతిరక్షణార్థము వచ్చుట తప్పా? ఇంతకును ఎంద ఱు హతులైనారు?

మరు—ఏడ్వురు. వారు సప్తర్షితుల్యులే.

అవే—మరుత్తా! అనేకకోటిసంఖ్యాకబ్రాహ్మణులలో నేడ్వురఁ జంపి నంతనే జాతిద్వేషముగాఁ బరిగణించి రాజనుపేరు పెట్టుకొని నాగ కులనాశము సేయఁబూనుట నీకు న్యాయ్యమా? ఔర్వాశ్రమమున నున్నయల్పసంఖ్యాకు లగునాగులను జంపినచో న న్నడుగువా రె వ్వ రనుధైర్యముతో నధర్మమునకుఁ బూనితివి గాఁబోలు.

మరు—రాజున కల్పసంఖ్యాజాతి యైనను అధికసంఖ్యాజాతి యైనను స మానమే. అడిగెడివారు లేకున్న నధర్మ మాచరించువాఁడను గా ను. హతులయినవార లేడ్వురే. కాని జలాశయంబులు నాహారప దార్థములును విషదూషితంబులు గావించి త్రాఁగ నీరును దినఁ

దిండియు లేకుండఁ జేయుటయు యోగులజాడ దెలిసినచో బుస్సు బుస్సుమని బుసలు కొట్టి విషజ్వాల లుమియుటయును గాళ్ల కడ్డ పడి కఱువఁ బోవుటయుఁ బాటిపోవ వీలైన లేకుండఁగ మార్గంబు లు నిరుద్ధంబులు గావించుటయుఁ జూడ బ్రాహ్మణజాతినే కాక మానవజాతి నంతను అంతరింపఁజేయఁ దలఁచి నట్లు కనఁబడఁ దో అదిగో! స్ఫటాటోపంబున నెల్లర బెదరించుచు నాగులు వేలకొలఁది వచ్చుచున్నారు. ఇప్పుడు నీబలము నమ్మి యెగిరెగిరి పడుచున్నారు. ఆహా! ఆవిషముఖుల వెనుక వేసికొని వచ్చివావా?

అవే—మరుత్తా! మానవజాతి నంతయు నటుండనిమ్ము, నాగజాతివారు ప్రకృతము బ్రాహ్మణజాతివారి నేమ్పరఁ జంపి రని గదా నాగుల హింసింపవచ్చితివి! మొదట నాగజాతికి బ్రాహ్మణజాతిపై నిష్కారణముగా ద్వేషము జనించునా? కలహకారణ మరయకుండ నెవరి నేని దండింపఁ బూనుట రాజధర్మమా? ఆవిషయము లన్నియు నడుగుటకే వారిజాతివా రందఱును వచ్చినారు. బ్రాహ్మణాధీనమనస్కుఁడ వైన నీయొద్ద న్యాయము దొరక దనుభయముచేత నన్ను శరణ మొందిరి.

మరు—జనకా! కలహకారణము వరియగునది కనఁబడదు. నాగులు నెప్పుకారణాభాస మొకటి కల దఁట.

అవే—పుత్త్రా! అదేమి?

మరు—బ్రాహ్మణులు వేదవేదాంతతత్త్వ మారసి నాగపూజవలన ముక్తి లభింప దనియు బ్రహ్మజ్ఞానముననే ముక్తి లభించు ననియు బోధించి రఁట.

అవే—అది కారణాభాసమని నీ వెట్లు సమర్థింపఁగలవు? అదియే గొప్ప కారణము. చిరకాలమునుండి పండితపామరసామాన్యముగా సకల

జనులకు భోగులయెడఁ గలభక్తి యోగు లొక్కమాటతోఁ జెడఁ గొట్టిరి. దానిచేత నాగజాతి యనిన భయభక్తులు పోయినవి. ప్రాణము పోఁగొట్టినవాఁడు శత్రువు గాఁడు. మానము పోఁగొట్టిన వాఁడేశత్రువు. వారిబోధనములవలనభోగిజాతికధోగతికలిగినదఁట.

మరు—కుటిలగాములగుభోగుల కధోగతి కలుగుట యాశ్చర్యమా!

అవే—ఆయుక్తిమాటల కేమి?

మరు—బ్రహ్మజ్ఞానసంపన్నులు బ్రహ్మజ్ఞానముననే ముక్తి యనిరిగాని నాగజాతిని బ్రత్యేకించి నిందించినట్లు నేను వినలేదు.

అవే—నిందింప కేమి? బ్రాహ్మణు లిట్లు బోధించిరని విన్నాను. విను.

ఉ. పాములఁ బూజసేయుచును • బాలును బెల్లపుఁబిండిఁ జిమ్మిలిన్
గ్రామపుఁబుంతఁ బుట్టపయి • రంధ్రములం దిడి నాగదేవ! మా
బాములు వాపి కావు మని•ప్రార్థనసేయుచుఁ బుట్టమృత్తికల్
ప్రాముకొనంగ ముక్తిఁ గను•భాగ్యము పట్టదు విశ్వసింపుఁడీ.

మరు—వారైనను అంతకంతో క్తిగాఁ జెప్పి యుండరు. ఒకవేళ, వేదాంతరహస్యవేత్త లట్లుసెప్పినను దప్పా?

అవే—తప్పు దండజకు మెట్టవేదాంతము ముదిరిపోయినది. వేదములో సర్పస్తుతులు సర్పదేవతాకమంత్రములును నాగుల నుద్దేశించిన హోమవిధానంబులును లేవా?

మరు—సర్పస్తుతి యున్నను చలిమిడిముద్దలుఁ బాలు బెల్లమును పుట్టలలోఁ బోసి పాములను పెంచు మని యున్నదా? లేదు లేదు. అదిగాక వేదాంతవాక్యములు పరమప్రమాణములు గాని వేదైకదేశమున నేయర్థవాదసందర్భమునసోచెప్పినవి ప్రమాణములగునా?

అవే—"వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థు" లగుసన్యాసుల కట్టిభావములుగలిగినను అజ్ఞుల కవి బోధించినచోఁ గొందఱకు బాధ గలుగును.

మధు—బాగు! బాగు! ఎవరికో ఏదో బాధ కలుగు నని బ్రిహ్మజ్ఞాన
   ము బోధించుట గూడ మానవలసినదా?
క. అజ్ఞులకు బోధసేయని
   తజ్ఞులవిద్యావిశేషధర్మము లెల్లన్
   ప్రాజ్ఞులు మెత్తురె యజ్ఞుల
   యజ్ఞానము వాపు టొక్క_యపరాధ మొకో!
   జనకా! వాదోపవాదముల కేమి, పరమార్థ మాలోచించిన
   చో యోగులు నిరపరాధు లనక తప్పదు.
అవే—కుమారా! చక్కఁగా నాలోచింపుము. పరమార్థమున నెట్లు
   న్నను వ్యవహారధర్మమున నొకజాతియెడఁ జిరకాలమునుండి సర్వసా
   ధారణముగా నుండుగౌరవమునకు భంగము గలిగించుట యనుపా
   ప మాచరించినవారు పాపులు. అట్టిపాపులపైఁ బాపజాతి ద్వేష
   మూనుట దోషమా? అది యాత్మగౌరవరక్షణము గాని తిని కూ
   ర్చుండలేక తెచ్చినయభియోగము గాదు. మానవులయెడ నీకభి
   మాన మున్నచో మహాధనంబులు వారి కిమ్ము. బ్రాహ్మణుల
   యందు నీ కధికాభిమాన ముండె నేని వారియాగములకు సాహా
   య్యము సేయుము. పర్వదినములందు సంతృప్తిగా భోజనం బిడు
   ము. సర్వజాతిసాధారణం బగురాజకీయవ్యవహారంబున నొకజాతి
   వారియెడలఁ బక్షపాతము సూపరాదుసుమా! ఆత్మరక్షణపరు లగు
   నాగులు సాపరాధు లనుట యనాలోచితము.
మధు—మనము కేవల మూహాపాండిత్యము చూపుచు వాదము సేసి
   నచో ఏవిషయమును ఇదమిత్థ మని తేలదు. కావున నిట్టివిషయ
   మునఁ బ్రత్యక్షసాక్ష్యము గ్రహించి తిదనుసారముగా దండ్యాదం
   డ్యనిర్ణయము సేయుట న్యాయబద్ధము. అది రాజునకు విహితమ్ము

పూజనీయ మాననీయయు నీకుఁ దల్లియు నాకు విశాలమహీయయు నగు వీరమహాదేవి యీయాశ్రమమున నుండి జరిగినవిషయములు కన్నులారఁ జూచి చెప్పినసందర్భములనుబట్టి నాగజాతి దండ్య మని నిర్ణయించితిని. ఇంతకును, ఏకారణమున నైన నేమి పరులకుఁ బ్రాణహాని గావించినవారు దండ్యు లనుట నిర్వివాదము. దండ్యుల దండించుచుండ నడ్డువచ్చువారు గూడ దండ్యులే. నారాజధర్మమున కడ్డురాకుము.

అవే—కుమారా! నామాట గూడ విను. మన కాదరణీయయు నీకుఁ దల్లియు నాకుఁ బ్రేయసియు నగుభామిని మున్ను నాగజాతివారి కొకవర మిచ్చినది. ఆవరమునకు ఫలముగా నాగులు నీజననిని శరణుఁ జొచ్చి యార్త రక్షణము గావింపు మనికోరిరి. నీజనని వారి కభయ మిచ్చినది. భవదీయజననీప్రోత్సాహంబున నేనును నాగజాతిని రక్షింపఁ బూనితిని. మాప్రాణములనైన నిచ్చెదము గాని శరణాగతుల శత్రువులబారి కిచ్చెదమే? నీవు మా యార్త రక్షణధర్మమున కడ్డు రాకుము. నీయస్త్ర ముపసంహరింపుము. ఉపసంహరింపవేని నాచేతనున్నఖడ్గమే నీయస్త్రము నుపసంహరింపఁ జేయును.

మరు—(తల్లివైపు తిరిగి) తల్లీ! నేను రాజధర్మమునకుఁ గట్టువడి మాతృవాక్యోల్లంఘనము సేయవలసి వచ్చినందులకు విచారించుచున్నాను. కోపింపకుము. ధర్మసూక్ష్మము దురవగాహము. నీవు దూరముగాఁ దప్పుకొనుము. (తండ్రివైపు తిరిగి) తండ్రీ! వాగ్వాదము లేల? తుదిమాట వినుము.

చ. కుటిలగతుల్ ద్విజిహ్వులును ♦ గోరలయందు విషంబు గల్గి యె
ప్పటనొ నిగూఢు లై జనులఁ ♦ జంపెడు వా రని నీ వెఱింగియుం

కటకట! భోగిజాతి నెటు ♦ గావఁగ వచ్చితి విద్ధి ధర్మ్యమే
పటుతరశక్తిఁ ద్రుంచెదను ♦ వారల వారలఁ గాఁచు వారలన్.

అవే.—ఎంత తెంపరి వైతివిరా! తుదకు పితృహత్య గట్టుకొనుటకుఁగూడ తెగించెదవా యేమి? ప్రియసీ! నీవు దూరముగా తప్పుకొనుము.

భామి.—పుత్త్రా! నామాట సెల్లింపుము.

మరు.—తల్లీ! క్షమింపుము. రాజధర్మావలంబినై నీమాట దాటి నందులకు క్షమింపుము.

అవే.—ప్రియసీ! నీమాట సెల్లించువాఁడనునే నుండఁగా వాని నేల బతిమాలెదవు. నీవు దూరముగాఁ దప్పుకొనుము.

భామి.—మీసెలవు. ఏమైనను ఆర్తరక్షణధర్మము వీడరాదు గదా. (దూరముగాఁ తప్పుకొనును.)

అవే.—మరుత్తా! పటుతరశక్తి నీకే కల దనుకొంటివిరా?

ఉ. పుత్త్రుఁడ వందు శాంతముగ ♦ బోధనసేయుదుఁ గాని లేనిచోఁ
శాత్త్రవబుద్ధి నచ్చటనె ♦ చక్కడఁగింపనె నిన్ను మద్దయా
పాత్త్రము నాగజాతి యిఁక ♦ వారియెడం బగ వీడు వీడవేని
బుత్త్రక! నన్నుఁజంపు మటఁ ♦ బోవఁగఁజూనుము వారిఁజంపఁగాన్.

మరు.—అసహాయశూరా! పరభయంకరా! కరంధమకుమారా! నీవు పుత్త్రా! పుత్త్రా! యని సంబోధించుటచేత నామనంబు భక్తిఁబ్ర మగుచున్నది. రణరంగంబున మనకు వావివరుస లేల?

ఉ. పుత్త్రుఁడఁ గాను నీకు నిఁకఁ ♦ బోల్పఁగఁ దండ్రివి గావు నీవయిన్
శాత్త్రవభావ మొందితిని ♦ శాశ్వతరాజ్యవిధానమూలమౌ
సూత్త్రము దాఁటఁ జూచెదవు ♦ శూరతఁ జూపుము నిన్ను నీకృపా
పాత్త్రులఁ గూడఁ ద్రుంచెద న♦పాత్త్రులఁ జేర్చుఫలంబు నొందుమీ.

అవే.—ఏమి వదరుచున్నావురా?

శా. ఔరా! యెంతటిదుష్టసాహసము! నీ•హానిఁజ భవన్మాతయున్
స్త్రీరత్నం బగునాదుతల్లియును ని•స్సీయంచు శోకింపఁగా
వారిం దేర్చుట గష్టమంచు మదిలో • భావింతు నీప్రాణ మా
హారింపం జనుఖడ్గ మాఁపుట కుమా•రా! దుర్భరం బయ్యెమున్.

మరు—వీరమహాదేవీకుమారా! వైశాలినీమనోహరా! అసహాయశూ రా! వీరాగ్రేసరా!

ఉ. తల్లులమాట యేల యిఁటు • దైన్యము వారికిఁ జేర్చ దేల నీ
తల్లియె దుష్టశిక్షకయి • ధైర్యముతోఁ బురికొల్పె నన్ను నా
తల్లియె యార్తరక్షకయి • ధైర్యముతోఁ బురికొల్పె నిన్ను నీ
పొల్లగుమాట లేల యిఁకఁ • బోరునఁ జంపుము లేద చావుమీ.

అవే—కుమారా! మరుత్తా! చుట్టు నున్నమనుష్యులును ఆకాశము న నేగుచు నాఁగినవైమానికులును బళీ బళీ యని నిన్నుఁ బ్రశం సించుచున్నారురా! "పుత్త్రాదిచ్ఛేత్పరాజయ" మ్మనుట నా యెడ సఫల మయినది. నేను ధన్యుఁడనే. (కొంచెమాలోచించి) ఇది యెట్టిధన్యత! ఏమివ్యామోహము! శరణాగతరక్షణము సే యకున్నచో నాబ్రతు కెందులకు? పుత్త్రప్రేమము నా కళ్లు తో పించుచున్నది.

మరు—ఇది శూరలక్షణమా?

చ. పరులు బళీ బళీ యనుటఁ • బల్కులు ఛీ యని తిట్టు టొక్కటే
తిరుగవు నామహాస్త్రములు • ధీశత గల్గిన నిల్చు తల్లియో
తరుణియొ యేమ్చు సంచు నిట • దైన్యము సూపెదె ధర్మరక్షకై
తెరలక పోరువారి కిలఁ • దీరు నిహంబుఁ బరంబుఁ బూర్ణమై.

అవే—(తనలో) యౌవనాగమమున నొంతినయసహాయశూరత్వాభి మానమునకు వైశాలినీస్వయంవరకాలముననే కొంతభంగము వా

టిల్లినది. పితృబలాత్కారమున రాజ్య మేలినస్వల్పకాలములో పౌరుషగౌరవములు దక్కినవి. ఈజీవితావశేషమున నీధర్మయుద్ధమున వెనుదీసితి నేని మానభంగంబు తప్పదు. మానభంగముకంటెc బ్రాణభంగమే కొంతమంచిది.

తే. యుద్ధమా ధర్మరక్ష కౌ • యుద్ధ మగుట
గొడుకుచేతను జచ్చుట • గొంతనయము
కొడుకుc జంపితి నేనియుc • గొమరు నైన
నాత్మరక్షకునై చంపె • ననెడికీర్తి.

సర్వవిధంబుల నేcటియుద్ధమునcజచ్చుటగాని చంపుటగాని యుత్తమోత్తమంబే. (పైకి) కరంధమపౌత్రా! ఈఖడ్గము నాయాత్మరక్షణాధర్మమున కడ్డువచ్చినవాని కంఠము ఖండింపc దహతహపడుచున్నది.

మరు—ఏలయీవృథావాక్యాలాప! ప్రయుజ్యమానంబు లగునాయస్త్రముల నాపc జాలకున్నాను. నీవు ధనుర్ధారివై యస్త్రసంధానము గావింపుము.

అవే—ఇదిగో! అస్త్రంబుc బ్రయోగింతు. (విల్లుచేతcబట్టి యస్త్రమును సంధించును.)

మరు—మాయిరువురనడుమ నెవరును నిలcబడకుcడు. అడ్డువచ్చినవా రలంతరించి పోవుదురు సుండీ.

అవే—అరే! మరుత్తా! కాచికో! నీయస్త్రము రానిరా!

(కొందఱు యోగులును నాగులును పటాక్షేపమునc బ్రవేశించి యిరువుర నడుమ నిలcబడుదురు.)

మరు—హా! హా! ఏమిది! నా యమోఘాస్త్రంబులు నేcడేలకో ముందునకుc బోవ జాలకున్నవి! గారుడాస్త్రమా! బ్రహ్మా

తుకు లగునాగులను, వారిపక్షమున వచ్చువారిని జంప జంకెద వేల? ఒక్క బ్రాహ్మహత్యకుఁ దక్క ఏహత్యకును జంకనినీవు నేఁ డిట్లు వెనుదీయుట యేల? సంవర్తునియనుగ్రహము తప్పినదా యే మి! (ముందువైపు చూచి) బ్రాహ్మణు లెవరో నడుమ నడ్డగా నున్నారు. దానిచే నాయస్త్రమాఁగినది కాఁబోలు.

అవే—అరే! మరుత్తా! అస్త్రము రానిమ్ము. ఆఁగిపోయిన దేమిరా!

మరు—ఎవరో కొందఱు యోగు లడ్డగా నిలఁబడినారు. దాన నా యస్త్రమాఁగినది. బ్రాహ్మణులారా! తప్పుకొనుఁడు. తప్పుకొనుఁడు.

యోగి—మరుత్తా! మానిమిత్తమునఁ బితృహత్య గట్టుకొనకుము. అ స్త్రముసంహరింపుము.

మరు—అసహాయశూరా! ఉపన్నాగము వచ్చినావా యేమి? బ్రా హ్మణులారా! మానవజాతిఘాతుకులును అందును బ్రహ్మఘాతుకు లు నగునాగులను జంపునాయస్త్రమున కడ్డువచ్చినవాఁడు తండ్రి యైనను సరే. ఎవఁడైనను సరే. మీరు దీని కడ్డురాకుఁడు. బ్రహ్మ ఘాతుకసంహారమున కడ్డువచ్చు మీరు బ్రాహ్మణులైనను బ్రహ్మ ఘాతుకపక్షమువారిగాఁ బరిగణించెద. నాగుల ప్రోత్సాహమున నో యితరులప్రోత్సాహముననో బ్రహ్మఘాతుకులకు సాహాయ్య ము సేయవచ్చితిరి కాఁబోలు. స్వజాతిరక్షణమున కడ్డువచ్చుమీరు జాతిద్రోహము సేసినమహాపాపులగుదురు. అస్త్రమా! స్వజాతి ద్రోహమునఁ గర్మచండాలురగు నీబ్రాహ్మణాధములఁ జంప నీ వే ల జంకెదవు? హా! హా! అస్త్రము మోఘ మయ్యెనే! నేను సం వర్తుని కేమైన ద్రోహము సేసితినా యేమి?

అవే—మరుత్తా! అట్లు సరిపెట్టుకొనుము. అస్త్ర మక్కడనే యాఁగిన దేమి? నీయస్త్రము రాకున్నను, ఇట్టిదుష్కార్యమునకుఁ గడంగిన

నీగర్వ మణంచుటకు ఇదిగో నాయస్త్రము వంపెదను జూడుము. కా చికో! (అస్త్రము ప్రయోగించును) అహాహా! ఏమిది? నాయస్త్రి మూఁగిపోవుచున్నది. ఇదేమో మాయగా నున్నది. అస్త్రిమా! నాగజాతి వధోగతిపాలుసేయుటకొఱకై నాగజాతిని నశింపఁజేయఁ జూచిన బ్రాహ్మణజాతిని బ్రాహ్మణజాతిరక్షయును వచ్చి నాకుజు జంప జంకుచున్నా వేమి? నాగజాతి కభయ మిచ్చితి నన్నమా ట మఱచినావా? శరణాగతరక్షణావ్రతునకు ఛాందసుఁడైనను చాం డాలుఁడైనను సమానుఁడే కదా. సర్వసామాన్యధర్మము జ్ఞప్తికి వ చ్చుటచే సంశయించుచున్నావు కాఁబోలు. ధర్మసూక్ష్మము జ్ఞప్తి కిఁ దెచ్చుకొనుము. శరణాగతరక్షణైకవ్రతునకు బ్రాహ్మణాబ్రాహ్మ ణసర్వజాతిపగజాతిస్వదేశీయవిదేశీయుస్త్రీపురుషస్వకీయపరకీయ బాం ధవాబాంధవమిత్రామిత్రభేదంబులు లేవు-లేవు. వానికి బ్రహ్మ హత్యాదులు పాపకర్మంబులుగావు. పైపెచ్చు, పుణ్యకర్మంబులే. అస్త్రిమా! వెనుదీయకుము. పొమ్ము. (ప్రయోగించి ముందున కుఁబోవకుండుట మాచి) ఆహా! ఏమి యీమాయ? అస్త్రిము ప్ర సరింపదే? నే నవేక్షితుఁడను గానా? కరంధముకుమారుఁడను గా నా? శరణాగతరక్షణవ్రతము తప్పుచున్నదేమి? (ముందునకుఁగల యఁజూచి) ఏమిది! నాగజాతిరక్షణమునకుఁ బూనిననాయస్త్రిమున కు నాగులే యడ్డువచ్చుచున్నా రేమి? కావుననే నాయస్త్రి మూఁ గిపోయినది. నాగాధములు గొందఱు నాగజాతినాశనము గావింపఁ దలఁచినబ్రాహ్మణుల మాయలలోఁబడి వారిపక్షమునఁ జేరి నాయ స్త్రిమున కడ్డువచ్చి నిలిచినారా? మీ క్రోత్సాహము సేసినవా రు మాయావాదు లగుబ్రాహ్మణులా? అట్టిమాయావాదులపక్షము న వచ్చినమరుత్తుఁడా? నాగజాతియందుఁ బుట్టి నాగజాతినాశకు

లమాయలలోఁ బడి స్వజాతిద్రోహము గావించెదరా? మిమ్ముల ను మీప్రోత్సాహకులఁ గూడ నశింపఁజేయ నిదిగో యీయస్త్రము వచ్చుచున్నది. శరణాగతజాతిలోనివా రని మిమ్ముఁ జూచి నాయస్త్రి మాఁగినది. అస్త్రివరా! యథార్థవిషయ మెఱిఁగినావు గదా! వారి సంహరింపుము.

నాగులు—అసహాయశూరా! ఆఁగుము. ఆఁగుము. మానిమిత్తము నీకుమారుఁడైన మరుత్తమహారాజును సంహరింపఁ బూనకుము.

అవే—మీమాయమాటల కేమి! తొలఁగిపొండు. లేదా ఈయస్త్రాగ్నికి మీరే ప్రథమాహుతి కండు.

మరు—స్వజాతిద్రోహపరు లగుబ్రహ్మబంధులారా! తప్పుకొనుఁడు. తప్పుకొనుఁడు. లేనిచో నాయస్త్రమునకుఁ బ్రథమకబళ మగుదురు.

ఔర్వుఁడు—(పటాక్షేపమునఁ బ్రవేశించి) ఆఁగుము. ఆఁగుము.

మరు—తప్పుకొనినారా? (తలయెత్తిచూచి) ఆహా! ఔర్వుఁడుఁ గూడ వచ్చి యడ్డుగా నిలచినాఁడే! నాయస్త్ర మెట్లు ప్రసరించును?

అవే—తప్పుకొనకేని యిదిగో స్వజాతిద్రోహినాశకాస్త్రము ప్రయోగించుచున్నాను.

వాసుకి—(పటాక్షేపమునఁ బ్రవేశించి) వలదు. వలదు. మేము జాతిద్రోహులము గాము. నేను నాగరాజగు వాసుకిని.

అవే—ఎవ రతఁడు. వాసుకియా? వాసుకీ! ఏమిది? నాగజాతినాశకులఁ జంపునా కేల యడ్డువచ్చినావు. ముందు మాచేఁ బ్రతిజ్ఞ చేయించి యిప్పుడు నన్ను భ్రష్టప్రతిజ్ఞుని గావింప వచ్చినావా?

వాసు—మహాశూరులారా! శాంతింపుఁడు.

శా. ఔరా! యోయసహాయశూర శరణా♦యాతత్రాణచణా!
ఔరా! యోయి మరుత్తరాజ! నిజధ♦ర్మాయత్తచిత్తోన్నతా!

వైరిత్వంబును మాని యోగివరులున్ • బాతాళభోగీశ్వరుల్
నీరక్షీరవిధంబున న్మెలఁగ నిర్ణీతంబు శాంతింపుఁడీ.

మీయస్త్రంబు లుపసంహరింపుఁడు.

అవే—మరుత్తా! వింటివా! వాసుకిమాటలు.

మరు—ఎదిరివారిమాటలు విని యెట్లు విశ్వసింతు. ఔర్వమహర్షి యేదో యనుచున్నాఁడు. విన నిమ్ము.

ఔర్వ—

ఉ. ఔర! మరుత్తరాజ! వినవా! ధాత్రిహారా! యసహాయశూర! మీ
పోరితముం దృజింపుఁ డిఁక • భోగులు మానిరి జాతివైరముల్
వైరిహతుల్ మునీశ్వరులు • ప్రాపితజీవితు లైరి యెల్లరున్
క్షీరము నీరముం బలె వసింతురు భేదము లేక మీదయన్.

ఆయుధము లుపసంహరింపుఁడు. శాంతింపుఁడు.

మరు—తండ్రీ! ధన్యుల మైతిమి. హతు లగుయోగీశ్వరులు పునరుజ్జీవితు లగుటయు భోగిజాతి యోగిజాతి యెడ జాతిద్వేషము మానుటయు నాయస్త్రోపసంహారమునకుఁ గారణంబు లైనవి.

అవే—కుమారా! భవదీయాస్త్రోపసంహారమే మదీయాస్త్రోపసంహారమునకుఁ గారణ మైనది. (అస్త్రము లుపసంహరింతురు)

మరు—జనకా! యిటు దయసేయుము. ఔర్వవాసుకు లేమియో చెప్పఁబోవుచున్నారు విందము..

(మరుత్తావేక్షితులు ఔర్వునికి నమస్కరింతురు.)

ఔర్వ—మహావీరులారా!

చ. జనకుఁడుఁ బుత్త్రుఁడున్ జనుల • సౌఖ్యము గోరుచు ధర్మరతులై
యనిని మమూర్ఘులై కదిసి • యస్త్రము పట్టినవారు గద్దిరే

జనకుని మించుకొడుకుఁ డను • జాతుని మించినతండ్రి మీరు స
జ్జనసుతకీర్తిఁ గాంచి యిల • సౌఖ్యము నొందుఁడు ప్రేమపూర్ణులై.

మరు—ఔర్వమహర్షీ ! మీయాశ్రమంబున నాగవస్థు లగు యోగులు పునరుజ్జీవితు లైనారా ?

ఔర్వ—మరుత్తమహారాజా ! మీయనుగ్రహంబునఁ బునరుజ్జీవితు లైనారు.

మరు—అందు మాయనుగ్రహ మే మున్నది? మీలో మీరే సంధి గావించుకొనినారు గదా !

ఔర్వ—మీయిరువురు స్వధర్మరక్షణార్థమై ప్రాణముల నైనఁ ద్యజింపఁ దెంపు సేయుట సూచిన నాగజాతివారు తమయధర్మప్రవర్తనమే యింతమహాఘోరయుద్ధమునకు మూల మని యెంచి మనస్సులో భయపడి లోపల నున్నవిష మంతయు వెడలఁ గ్రక్కిరి. నిష్కపటధర్మప్రవర్తకుఁ డైన మహానుభావుని జూచినచో అధర్మప్రవర్తకులు గజగజ వడంకుదురు గదా! లోపలిక్రుళ్లు వెలిపుచ్చి తుదకు వారును నిష్కళంకాత్ము లగుదురు.

మరు—వారు తమయధర్మము గ్రహించినారా ? వారిమనసులలోఁ గలవిష మేమి ?

ఔర్వ—వాసుకియే మనవిసేయును. అతఁడు తాను జేసినతప్పునకు సిగ్గుపడి తలయెత్త లేక నోట మాట రాకయున్నాఁడు.

ఆవే—వాసుకీ ! ఏమి ? నీవంతసిగ్గుపాటు నొంద నేల ? భవదీయజాతి రక్షణమునకై వచ్చినవారితోఁ జెప్పుటకు నీకు సంశయ మేల ?

వాసు—ఎవరితోఁ జెప్పుటకును సంశయము లేదు. మీసమక్షమునఁ గపటవృత్తిఁ జేసినతప్పు నొప్పుకొనక తప్పునా ? తప్పు నొప్పుకొను నప్పుడు చెప్పినఁ దప్పేమి ? మీకు వృథాగా శ్రమము గలిగించితి

మి. క్షమింపుఁడు. కరంధమకుమారా! నిను యథార్థస్థితి తెలుపక వంచన చేసితిమి. వంచకులము క్షమింపుము.

అవే.—ఏమది! సంశయింపక వచింపుము. ఏలోప మున్నను నేను దీర్చెదను. నీవు నేసినవంచన మేమియు నాకు స్ఫురింపలేదు.

వాసు.—అసహాయశూరా! మరుత్తమహారాజా! సంవర్తతేజోభీతులయి సంవర్తమరుత్తుల విడఁదీయ నెంచినదివస్పతిబృహస్పతులమాయాతంత్రములచే మే మార్యాశ్రమవాసు లగుమానాగజాతివారినిఁ బురికొల్పి బ్రాహ్మణజాతివారిని జంపించితిమి. దాన మరుత్తుని సంవర్తునొద్దనుండి విడఁదీసికొని వచ్చుటకు మూలకారణ మైతిమి. బృహస్పతిప్రోత్సాహమున నే, పూర్వము భామిని యనుగ్రహించిన వరఫలితముగా, ఆమెను శరణు సొచ్చి మరుత్తుజనకుఁడ వగునీచేతనే మరుత్తమహారాజును జంపింప నీపాపభూయిష్ఠ మగుపన్నాగము పన్నినారము. పితాపుత్త్రు లగుమీయిరువుర స్వధర్మరక్షణమహిమను విశాలెంపును జూడ బృహస్పతిదుర్బోధజాతవిమతబుద్ధిని లోపల నాఁపలేక మేము నేయు దుష్కార్యమునందు మాకే రోఁతజనించి యార్యునితో మాతప్పు చెప్పి క్షమింపఁ గోరితిమి. మేము మృతులఁ గావించినయోగులను అమృతాహరణంబునఁ బునరుజ్జీవితులఁ గావించినారము. వీరే వారు! (కొందఱ యోగులను చూపుము) మీయుద్ధసన్నాహము సురేంద్రనుతాచార్యులు చాటుచాటులనుండి చూచుచున్నారు. వారికృత్రిమోపాయము బయలుపడె నని పరితపించుచు నీయజ్ఞవాటికకై పునకుఁ బోవుచున్నారు. ప్రాణములు పోయినను వారికపటోపాయంబు బయలు పెట్టఁగూడ దని చెప్పిరి గాని ధర్మస్వరూపు లగుమీయెదుట సత్యము దానియంతట నదే వెలువడినది.

మరు—ఓహో! పరులమాయలకు లోఁబడి మీరింతపొరపాటు గావించితిరి గదా! ఇంతకు నిట్లు కావలసియున్నది. భవితవ్య మెవరు దప్పింపఁ గలరు? వా రింకను నేమి సేయ నున్నారో? నేను యజ్ఞవాటికకుఁ బోవలయు. మీ రెన్నఁడు నిట్టివారిమాటలు విని జాతిద్వేషము నొందకుఁడు. దాన మీరు చెడిపోవుటయే గాక సర్వలోకసంహారమునకుఁ గారకు లగుదురు.

వాసు—చిత్తము మహాప్రభూ! చేసినతప్పు లన్నియు క్షమింపుము. నీకెప్పుడును దాసుల మయి యుందుము.

అవే—అన్నా! ఎంతపని జరగినది! వాసుకీ! మీరు నాతోఁ జెప్పిన ద్వేషకారణము అసత్యమా?

వాసు—అంతయు లకే కదా నిన్ను వంచించితి మంటిని. క్షమింపుము.

అవే—ఏమి! యింద్రునిమాయమాయావిశ్వాసము. బృహస్పతికిఁగూడ నిట్టిబుద్ధులు పుట్టినవా!

మరు—ఎవరి కెట్టిబుద్ధులు పుట్టినను మన కేమి? సంవర్తగురువరుండే సర్వమునకు సహాయుఁ డగును. వారికపటోపాయమున నేను మాతృవాక్యోల్లంఘన పితృహత్యోద్యోగంబులు గావింపవలసివచ్చెను.

సీ. జనక! భవత్పదంబులను ♦ సాక్షిగ నిల్పియె రాజ్యపాలనం
బును జరియింతు నేఁడు ♦ నినుఁ బోరను దాఁకెడువేళఁ గూడ నా
మనమునఁ గొల్చి ధర్మమతి ♦ మానక పోరితిఁ బుత్త్రుఁ గావుమీ
మనమున లేదు కోప మను♦మానము పీడుము భక్తిపూర్ణుఁడన్.
వీరధర్మంబున వీరకర్మమున తూలనాడిననన్ను క్షమింపుము.

అవే—కుమారా! ధర్మశూరా!

తే. తండ్రినైనను బ్రియతమ ♦ తనయుఁడైన
ధర్మనాశంబు సేయఁగఁ ♦ దలఁచువాని

జంపc దగుc గాని విడువరాగc • జనుసె పుత్ర!
నలిపితాcడవు ధర్మసం•స్థాపనంబు.

కుమారా! మీతల్లియు మాతల్లియుc గూడ నిన్నుc జూడ వచ్చుచున్నారు.

(వీరమహాదేవియు భామినియుc బ్రవేశింతురు.)

మరు—పితామహీ! నమస్కారము.

వీర—పౌత్రా! దిగ్విజయము గల్గుc గాత.

మరు—జననీ! నమస్కారము.

భామి—కుమారా! మీపితామహిదీవన వెంటనే ఫలించుc గాక.

వీర—మున్ను మాయాగముల కుపదర్శిము గావించిన బృహస్పతి కింతదుర్బుద్ధి పుట్టినదా? నీకేమియు భయములేదు. నీధర్మత్వే నిన్నురక్షించునులే.

అవే—(భార్యవైపు తిరిగి) మానినీ! ప్రియసీ! నీయార్తరక్షణసంకల్పము సిద్ధించినది. (తల్లివైపు తిరిగి) తల్లీ! మనుమనిచే బ్రాహ్మకులరక్షణము గావింపc జేసితివి. మృతు లగుయోగులc బునర్జీవితులc గావించితివి.

ఔర్వ—అంతే కాదు. మీరందఱును జాతిద్వేషనిరాసపూర్వకధర్మసంస్థాపనము గావించినారు గదా!

మరు—మేముసేసిన దేమున్నది. మీదయచే మేమునుసజీవులమైతిమి.

ఔర్వ—మీరు స్వధర్మరక్షణమున కింతతెంపు సేసి నాగజాతులమసంబులు మరలింపకున్నచో నీజాతిద్వేషము పెరిగిపోయి యనంతమై ముల్లోకంబుల నంత మొందింపకుండునా? ఇంద్రబృహస్పతు లింక నెట్టికపటోపాయములు పన్నుదురో? సంవర్తసాహా...

నీకు సర్వము సమంజస మగుcగాక!

మరు—అదిగో నాయభీప్సితము. వాసుకీ! సందేహింపక సపరివారము గా మదీయయాగదర్శనమునకు రమ్ము. ఔర్వాదిమహర్షులారా! మీ రెల్లరు యాగము నూడ విజయంచేయుఁడు. పితామహీ! జననులారా! ఇంద్రుఁ డింకను నేమి సేయఁ దలంచుచున్నాఁడో? నేను యాగవాటమునకుఁ బోవలయును. నేఁడే సంకల్పము గావింప నెంచినారము. మీ రీమార్గముననే యాగము సూడ దయసేయుఁడు.

అవి—మంచిది. మహేంద్రుఁడు గాని మహేంద్రపురోహితుఁడుగాని నిన్నేమి సేయఁగలరు? మేమును యజ్ఞశాలకు వచ్చెదము.

మరు—ఔర్వమహర్షీ! దండప్రణామంబు లాచరింతు. ఆశీర్వాదము సేయుచుండుఁడు. యాగశాల కేగి సంవర్తుఁ గలసికొనెద.

ఔర్వ—మరుత్తా! సంవర్తశక్తిసంరక్షితుఁడ వగుట కితరు లాశీర్వదిం పఁదగిన దే మున్నది. అయినను బ్రకృతస్థితి ననుసరించి భవదీయ పురోభివృద్ధి కనుకూల మగునాశీర్వాదవాక్య మొకటి పలికెద.

తే. పరులమాయలఁ బడిపోయి ♦ బాధపడక
యన్నిజాతులవారలు ♦ నైకమత్య
మొంది సంకల్పసిద్ధికి ♦ యుక్తమైన
పదవిఁ జరియింత్రు గావుతఁ ♦ బార్థివేంద్ర.

వాసు—అదిగో శ్రేయోమూలాల మహాధ్వనసహస్రజిహ్వాలతో వచిం చుచున్నాను.

అందఱును—సత్యము. సత్యము.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# మరుత్తరాట్చరిత్ర.

## పంచమాంకము.

(యాగశాలలో నున్న మరుత్తమహారాజును, తప మాచరించుచున్న సంవర్తుఁడును ప్రవేశింతురు.)

మరు—సంవర్తమహర్షి, నేను వెడలినప్పు డెక్కడఁ గూర్చుండెనో యక్కడనే కూర్చుండి తప మాచరించుచున్నాఁడే. (నమస్కరింపఁబోయి- ఆఁగి)

తే. జపతపంబులు సలిపెడు సమయమందు
త్వరగఁ బోయెడు వేళల దంతధావ
నాదివేళల మత్తిల్లు నట్టితతిని
వందనార్హుఁడు గాఁ డండ్రు వంద్యుఁ డైన.

కావున నితఁడు తనంతటఁ దానే తపము చాలించువఱకు నిరీక్షించి యుందు. (సంవర్తుని సమీపించి) ఇట్టితపోనిష్ఠాగరిష్ఠత గలదగుటను కనే వీనినిఁ జూచిన మహేంద్రాదులకుఁగూడ మనమున భయము గలిగినది. "తపసా దుష్కరం నాస్తి" యనుట తధ్యమేకదా!

సం—(కన్నులు తెఱచి చూచును.)

మరు—(నమస్కరించుచు) సద్గురూత్తమా! సాష్టాంగనమస్కార మాచరించుచున్నాను.

సం—మరుత్తా! మనోభీష్టసిద్ధి రస్తు.

మరు—నామనోభీష్టసిద్ధి భవదాశీర్వచనబలమునఁ గావలయునుగాని నాసామర్థ్యమునఁ గాదు. మహేంద్రబృహస్పతులు నాపైఁ గసిఁబూని నన్నెన్నివిధముల బాధపెట్టవలయునో యన్నివిధములను బాధపెట్టఁ దలఁచినారు. తుదకు భవత్పాదాబ్జములకు దూరస్థుని గావింపఁ గపటోపాయములు కొన్ని పన్ని నాగులచే యోగులను జంపించిరి. వారికృత్రిమోపాయమూలమున నేను మాతృవాక్యోల్లంఘనమును పితృహత్యోద్యమంబును చేయవలసినవాఁడ నైతిని.

సం—మరుత్తా! దివ్యదృష్టితో నంతయుఁ గనిపెట్టి చూచుచునే యున్నాను. మరలఁ జెప్ప నక్కఱ లేదు. మదుపదిష్టమహావిద్యోపాసన గావించినవో నీవు నాదగ్గఱ నున్నను దూరముగా నున్నను నిన్నెవ్వరు నేమియుఁ జేయలేరు.

మరు—మహాప్రసాదము. నాయం దట్టియనుగ్రహము నీకున్నది గనుకనే ఔర్వాశ్రమమున నంతయు సుఖపర్యవసాన మైనది. మహేంద్రుఁడు విమానముమీఁద నుండి చూచి తుదకు మనయాగవాటిపైపునకు వచ్చినాఁ డని వాసుకి చెప్పినాఁడు. వారీపైపునకు వచ్చినజాడ లేదే.

సం—మరుత్తా! మహేంద్రుఁ డంతతోఁ బోయినాఁ డని యనుకొనకుము. తుదకు తెగించి వజ్రధారియై తానే యుద్ధమునకు దిగు నేమో? పైవారిచేత నొకయాట యాడించిచూచినాఁడు. అది సాఁగలేదు.

మరు—గురువరా! భవత్పరోక్షముననే నన్నేమియుఁ జేయలేనియాతఁడు భవత్సమక్షమున నేమి సేయఁగలఁడు. వజ్రము గిజ్రము నన్నేమి సేయఁగలదు. తౌత్రమున జంకు లేదు గాని సురాచార్యాచ

శిత్రాభిచారికక్రియాకలాపోద్గతశక్తులు నాతేజంబునకు భంగంబు గావింపకుండఁగఁ గాపాడుము.

సం—అట్టివి మనవై పునకుఁ దేఁటి చూడఁగలవా ?

ఉ. ఆయమరేశయాజకుఁ డ♦హంకృతిఁ జేసెమహాహోమతంత్రముల్
సేయుదు వ్యర్థ మౌనటులు ♦ చేతను వజ్రము పూని వజ్రియే
పాయనికిన్గ వచ్చినను ♦ బ్రగ్రహపంక్తినిఁ బోలె స్తంభినీ
గేయకళావిశేషమునఁ ♦ గి మ్మనకుండఁగఁ గట్టి వైచెదన్.

(తెరలో)

వజ్రిని గట్టివైచెద ననుచున్నా వెవఁడవురా నీవు ?

సం—మరుత్తా ! మహేంద్రుఁడు స్వయముగా దిగినాఁడు. చూడుము

మరు—దిగనిమ్ము.

మహేం—(ప్రవేశించి) వజ్రిని గట్టి వైచెద నన్నవాఁ డెవఁడురా ?

సం—నేను. నేను (తొమ్ముమీఁదఁ గొట్టుకొనుచు)

తే. పశువు యూపంబునకుఁ గట్టు♦పగిది మంత్ర
బంధనంబునఁ గట్టెద ♦ వజ్రిధారి
ననుచు గర్వింపఁబోకు నే ♦ నాంగిరసుఁడ
మంత్రవాగ్వజ్రధరుఁడ నా ♦ మహిమఁ జూడు.

మహేం—ఆంగిరసుఁడ వనియే యాలోచించుచున్నాను. లేనిచో ఈ పాటి కేమి సేసి యుందునో.

మరు—(తనలో) ఈమహానుభావుఁడు నిజముగా మంత్రశక్తిచేత మహేంద్రుని బంధింపఁగలఁడు. దాన నాయాత్రమునకు భంగంబు గలుగును. మహేంద్రుఁడును, సంవర్తుఁ డాంగిరసుఁ డనుపంకఁ జూపి తప్పించుకొని పోవును. కావున సంవర్తు నుపశమిల్లఁజేసి నేనే మ

హేంద్రునికి సమాధానము సెప్పెద. (పైకి) సంవర్తా! నామనవి యాలింపుము.

తే. అభిచారికలబ్ధ మాయయహిత మగుచు
శ్రౌతసూత్రోక్తవిధుల నాక్రతువు నడపు
యాగమున దేవతాళి హావ్యంబుఁ గుడుపు
దైవవిభు నీవె బంధించు తలఁపు నెడపు.

నీయుద్యమంబునకు విఘ్నంబు గావించితిని. క్షమింపుము.

తే. రాచకొలమునఁ బుట్టితి రాజ నైతిఁ
జగతి నాచేత బంధింప వలయుఁ గాని
బ్రాహ్మణోత్తమ! నీచేత బద్ధు లగుట
భావ్య మా నాకు నాకీర్తి భంగపడదొ!

మహేం—ఏమి వీనిగర్వోక్తి. (పరిహాసముతో) మరుత్తా! కీర్తికాముండవా? సరే నిన్ను కీర్తిమాత్రశేషుని గావించెదనులే.

మరు—మహేంద్రా! మాట లెందులకు? మాగురువునసుజ్ఞఁ బొంద నిమ్ము.

సంవ—మరుత్త మహారాజా! నీకీర్తిని నిలఁబెట్టఁ దలఁచిననేను నీకీర్తికి భంగము గలిగించుకార్యము సేయఁ బూనను. ఎవ రైన నేమి? నీవే సమాధానము సెప్పుము. (మహేంద్రునివైపు చూచి) మహేంద్రా! మామరుత్తునిప్రార్థనమూలమున నిప్పటికి నాచే నీకు బంధనయోగము తప్పినది. అవశ్యకమైనచో మాశిష్యుఁడే గావించునులే. ఈమాటు మీగురువును వెంటఁబెట్టుకొని రాలేదేమి?

(తెరలో)

ఓరితుమ్మత్తా! సంవర్తా! నామాట గూడ నెత్తుచున్నావా? అంగిరసునకుఁ గూడ నప్రతిష్ఠ తెచ్చుచున్నావు.

మరు—సంవర్తా! బృహస్పతిగూడ దయసేసినాఁడు.

సం—రానిమ్మా. నీదయ యుండిన నా కేమి భయము.

బృహ—(ప్రవేశించి) ఓరియున్మత్తా! సంవర్తా! యే మనుచున్నావు? నామాట గూడ నెత్తుచున్నావా? అస్మజ్జనకుఁడైనయంగిరసునకుఁ గూడ నప్రతిష్ఠ తెచ్చుచున్నావురా! అంగిరసుఁడవయ్యు గురుబహిష్కృతుఁడైన మర్త్యు నొకని వెంటఁబెట్టుకొని వచ్చినావా? నీగురుత్వమునకును వానిశిష్యత్వమునకును సరిపోయినది. చాలుఁజాలు. మాశిష్యుఁ డగుమహేంద్రుని మర్త్యమాత్రునిచే బంధింపఁ జేసెద ననుచున్నావా?

మహేం—గురువరా! వానిదుర్భాషలు నీకును వినఁబడినవా? ఎందుల కనియూరకున్న వ్యాపారము ముదిరిపోవుచున్నది.

బృ—అ దెంతసేపు? మామొగము చూచి యూరకున్నావు గాని—

సం—మరుత్తా! విన్నావా? ఆయన మొగము సూచి యాయిందుఁడూరకున్నాఁ డఁట. ఆయన నిజముగా మాయన్న సుమీ! (బృహస్పతివైపునకుఁ దిరిగి)

తే. అన్న! నిజముగ నీవు మాయన్న వగుదు
మాయచే నింద్రుసద్బుద్ధి మాపినావు
బువ్వ పెట్టెడివానితోఁ బోరుపెంచి
యుంపుచున్నావు గా బంధనాస్థ మిపుడు.

బృ—ఓరియున్మత్తా! నీచేత అన్నా యని పిలిపించుకొనుటగూడ సిగ్గుగా నున్నదిరా!

సం—అవునవును. అట్టిమాట లేల? నీపెద్దతనపుగౌరవము నిలఁబెట్టుకొనుము. అంగిరసవంశమున కప్రతిష్ఠ తెచ్చినవాఁడను నేనో? నీవో? జ్ఞప్తికిఁ దెచ్చుకొని మాటలాడుము.

బృ—నీ వెందుల కరుగుచున్నావో నాకుఁ దెలియక పోలేదు. గృహస్థునకు ప్రతిష్ఠాప్రతిష్ఠలు గౌరవాగౌరవములు పుణ్యాపుణ్యములు ఏమైన నుండుట సహజము. బ్రహ్మచారివాఁడవగు నీ కేమి తెలియును? బ్రహ్మచారి వగు నీకు గురుబహిష్కృతుని వెంటఁ బెట్టుకొని రావలసినయావశ్యకత యేమి వచ్చినది?

సం—ఆవశ్యకత యేమి వచ్చినదా?—ధర్మరక్షణార్థము.—

మరు—గురువరా! వాక్యోపవాక్యము లేల పెంచెదవు? నాప్రార్థన సెల్లింపుము. నేనే వీరికి సమాధానము చెప్పెద.

సం—అట్లే కానిమ్ము.

బృ—ఇక్కడకు గురువు చెప్పుట నైనది. ఇంక శిష్యుఁడు బయలుదేరినాఁడు. అదియును వినెదము.

మహేం—(బృహస్పతితో) నేను వానికిఁ దగినట్లు చెప్పెద. నీ వూరకుండుము.

సం—దేవరాజదేవతాచార్యులారా! మాట లేల? మంచితనమునకు వచ్చితిరేని మదీయయాగమున మర్యాదగా సమర్పింపఁబడు హవిర్భాగంబులు గ్రహించి యాగఫలిత మిచ్చి దయచేయుఁడు. అందఱము ధన్యుల మగుదుము. వైరిభావమున వచ్చితిరేని వినుఁడు. దేవతాపురోహితా! జాతిమాత్రపూజ్యుఁడ వగు నీ కిదే నమస్కారము. దీనితో దూరముగాఁ దొలఁగుము. వెనుక నారదమహర్షి చెప్పినట్లు వాని కల్పాహారము ఔర్వాగ్నియును దొరకినది. ఇప్పు డిక్కడ నధికావమానము నీకు లభింపవలసి యున్న దేమో! తప్పదు. మహేంద్రా! మనము మాటలాడుట కాదు. మన మహాస్త్రంబులు పోట్లాడవలయు. మనము యుద్ధమున కనువగు మహారణరంగంబునకుఁ బోవుదము రమ్ము.

మహేం — మరుత్తా! మర్త్యమాత్రుఁడ వయ్యు మమ్ము రణరంగంబునకు రమ్మనుచున్నావా? ఏమి పొగరుఁబోతుఁదనము? ఆలోచించుకొనుము. వెఱ్ఱివానికి శిష్యుఁడ వగుటచేతఁ గాఁబోలు వెఱ్ఱిమాట లాడుచున్నావు.

మరు — మహేంద్రా! మాటలవలనఁ బ్రయోజన మేమి?

మహేం — (ప్రక్కకుఁదిరిగి బృహస్పతితో) మనము మర్త్యునితోఁ బోరికి దిగుట మంచిది గాదు. స్వర్గరాజ్యపీఠమునఁ గూర్చుండి వజ్రము ప్రయోగించెదను. అదియే యంతయు సాధించును.

బృ — మొదట మనము మర్త్యలోకమునకు వచ్చుటయే తప్పు. కారణాంతరమున రావలసి వచ్చినది. వచ్చినవేళ మంచిది కాకపోవుటచేత పౌర్వాశ్రమమున నట్లు జరిగినది. పోరిలోఁ బరాజయశంక మనకు లేదు గాని మర్త్యునితో నమర్త్యనాథుఁడు పోరుచున్నాఁడనుటయే యన్నివిధములను అంత మంచిదికాదు. అందులోను స్మరణమాత్రాగామి యగుకలహాశనుఁడు వచ్చెనేని ఏది యెట్లు పరిణమించునో? అతఁ డేమియు నెఱుంగనట్లు మనతో మాటలాడెఁ గాని దీనిలో వానికి నేదో కొంతసంబంధ మున్నది. "నారదుఁడు చెప్పినట్లు" అని మరుత్తుఁ డన్నమాట వినలేదా?

మహేం — విన్నాను. విన్నాను. మరుత్తుఁడు నారదనామస్మరణము చేయుటచేతనే యాతఁడు కూడ వచ్చిన నేది యెట్లు వచ్చునో యని నేనును సందేహించుచున్నాను.

మరు — మహేంద్రా! యాలోచనసేయుట సైనదా?

మహేం — ఆలోచన కేమున్నది. మర్త్యుఁడవైననీతోఁ బోరుట మాకవమానకరము. మఱియు మతిలేనిమాటలాడితి వేని మానము దక్కదు సుమీ. బృహస్పతీ! మనము స్వర్గమునకుఁ బోవుదమా?

నారాయణనామకీర్తనము వినఁబడుచున్నది. నారదుఁడు వచ్చుచున్నాఁడు గాఁబోలు. (ఇద్దఱును బయలుదేఱఁబోవుదురు.)

బృ—ఔనౌను. ఏదో పోరు తెచ్చిపెట్టక మానఁడు.

మరు—వజ్రిధరా! పోరికి రమ్మని పిలిచినపుడు పాఱిపోవుట వీరలక్షణమా? ఆఁగు. ఆఁగు.

మహేం—మేమాఁగుట యెందులకు? ఇదిగో! మావజ్రమే నీయాగవాటిక శ్మశానవాటికగాఁ గావింపఁ గలదు. వజ్రాయుధప్రయోగము గావించుచున్నాను. కాచికో!

(మహేంద్రుఁడును బృహస్పతియు నిష్క్రమింతురు.)

నారదుఁడు—(ప్రవేశించి)

క. నారాయణ నారాయణ
నారాయణ దేవదేవ ♦ నారాయణ శ్రీ
నారాయణ నారాయణ
నారాయణ నీవెదిక్కు ♦ న్యాయస్థులకున్.

మరు—నారదా! నమస్కారము. ఇదింతయు నీయనుగ్రహమే.

నార—విజయోస్తు. మనమరియాదల కేమి? మహేంద్రుఁడు పోవుచుఁ బోవుచుఁ వజ్రాయుధము ప్రయోగించిన ట్లున్నాఁడు. దానికిఁ బరిహార మాలోచించుకో. అదిగో! వజ్రాయుధాగమనధ్వని వినిపించుచున్నది.

సం—నారదా! యిటు దయచేయుము. వజ్రి మేమి సేయఁగలదు?

నార—సంవర్తా! నీసన్నిధానమున నట్లే కాని మరుత్తున కాయస్త్రంబు లన్నియు నలవడిచితివా?

సం—అతఁడే సర్వసమర్థుఁడు. నిమిత్తమాత్రముగ నుపదేశించితిని. మొదటవానిని నాయొద్దకుఁ బంపినవాఁడవు నీవే గదా!

నార—యజ్ఞవాటమున నున్నవా రందఱును భయపడుచున్నారు వజ్రి నిర్ఘోష మెక్కుడగా నున్నదే! ముం దది చూచుకొనుఁడు.

మరు—(యజ్ఞవాటికఁ గలయఁ జూచి) యాగవాటీసమావిష్టులారా! శిష్టులారా! భయపడకుఁడు. భయపడకుఁడు. ఇదిగో! వజ్రిటో ప ముపసంహరించెదను. చూడుఁడు. వజ్ర మక్కడనే యాఁగి పోయినది. మహేంద్రహస్తభూషణమా! వజ్రిమా! రా! రా! ఆ బడబడ లక్కడనే చూపెద వేల? దగ్గఱగా రా! తేదా దూరము గాఁ బో! అంతేకాని బెదరింపు లేల?

నార—నా చెవులు ధన్యములైనవి.

మరు—దంభోళీ! నీదంభంబులు గట్టిపెట్టు!

ఉ. బొగ్గును వజ్రిమున్ సరియఁ♦బోల్పఁగ నంచు వచింతు రార్త్విజుల్
నెగ్గదు నీప్రతాప మిఁక ♦ నిశ్చయ మయ్యెను యాగవాటి నీ
పెగ్గెలు సూప నడ్డిడిఁ ♦ బ్రేల్చెద బుగ్గిగఁ బొమ్ము వజ్రమా!
సిగ్గఱి నిన్నుఁ బంపుసుర♦శేఖరుఁ డేదరిఁ బోయెఁ జూతుమా!

నార—ఆహా! వజ్రియుధధ్వాన మంతరించినదే. ఆగాంభీర్యము, ఆగర్జనము ఏమైనది?

మరు—యజ్ఞవాటీసమావిష్టులారా!

మత్త. గర్జనంబులు గానరా విటఁ ♦ గాంతురే యట మీరు మ
త్తర్జనంబున వజ్రి మెచ్చుట ♦ దాఁగఁ బోయెనొ చూడుఁడీ
దుర్జనత్వముచేత నిందురిఁడు ♦ దుష్టభావల నాఁడుఁ ద
త్తర్జనంబున వీడకుండుఁడు ♦ స్థైర్యధైర్యము లెన్నఁడున్.

చూడుఁడు. చూడుఁడు. వజ్రము వజ్రిధరునికంటె వడిగాఁ బా ఱిపోవుచున్నది. (ఆకసమువంకఁ జూచి)

తే. భీమరమా! నీ వింత ♦ భీరు వగుచు
దూరమున నుండి యింకను ♦ దూర మగుచుఁ
దిగునె పరువిడ వజ్రి దాఁ ♦ దారసిలిఁక
చెప్ప తమ్మని యని సేయఁ ♦ జేత నైన.

నార—బాగు బాగు. నాకు సగముకడుపు నిండిన దన్నమాట.

(తెరలో)

ఎంతెంత మాటలాడుచున్నావు? మాగురువన్నట్లే మహాపవిత్రుఁడవైయున్నావే.

మరు—బృహస్పతిశిష్యుఁడు గాఁబోలు.

బృహస్పతిశిష్యుఁడు—(ప్రవేశించి) ఔను. బృహస్పతిశిష్యుఁడను. విద్యాధరనామధేయుఁడను. నీహితమును గోరినబృహస్పతి తుదిమాట యొకటి చెప్పు మని నన్నుఁ బంపినాఁడు.

మరు—ఏ మామాట?

విద్యా—అవధానముగా విని సమాధానము చెప్పుము.

ఆ. పితికితపముచేత ♦ భీమరంభు పోలేదు
భూసురాళిఁ జంప ♦ బుద్ధి రాక
యాగదీక్ష నుండు ♦ యజమాను హింసింప
మనసు రాక తాను ♦ మరలిపోయె.

నార—మంచియుక్తి. అవి వాచస్పతివాక్కులు గదా! వజ్రి యిదివఱ కెన్ని బ్రహ్మహత్యలు కట్టుకొన్నదో.

విద్యా—నారదా! ఒక్కనిముస మూరకుండుము. చెప్పెడిమాట చివరకంటఁ జెప్పనీ.

నార—చెప్పు చెప్పు.

విద్యా—

ఆ. పోవు నేఁతకాక ♦ పోలేమ వజ్రియు
మర్త్యుఁ దాఁకు టెంత ♦ మహిమ యనుచు
నిరసనముఁ బోయె ♦ నీయాగహవ్యంబు
నిరసనంబు సేయ ♦ నియతిఁ జేసె.

సంవర్తుని విసర్జింపుము. బృహస్పతియే నీయాగమున కుపదర్శనము గావించును. దాన మహేంద్రునితో మైత్రియు సర్వదేవతా ప్రసన్నతయు సకలాభీష్టసంసిద్ధియు సంఘటిల్లును. లేదేని అంధుని చేత నీతుఁ డగు నంధుఁడుఁ బోలె వెఱ్ఱివానివెనుక వెఱ్ఱివైపోయి చెడిపోయెదవు. శిష్యవాత్సల్యమున మనగురువు మరొక్కమాఱు నీ కీవార్త సెప్పఁ బంపెను.

నార—అదంతయు శిష్యవాత్సల్యమే కాఁబోలు.

మరు—దేవపురోహితాంతేవాసీ! వారిముఖ్యశిష్యుఁడు మహేంద్రుఁడు గాన వానియందే వాత్సల్య ముంపు మనుము. ఈవార్తకుఁ గూడ ఆశిష్యునందలివాత్సల్యమే కారణము. నాయాగంబున హవిర్భాగంబులు గొనకుండ దేవత లెల్లరు మూతులు బిగించుకొని కూర్చుండినను సరే కాని సంవర్తుని విడనాడ నొల్ల నని బృహస్పతితోఁ జెప్పు. పో!

నార—మంచిమాట చెప్పినావయ్యా!

సం—మరుత్తా! మాయన్న యంపినవార్త విని నిజముగా దేవతలు యాగభాగంబులు గ్రహింప రారేమో యని సందేహించుచున్నావా యేమి?

నార—సందేహము ఉండకుండునా? దేవతలును భూదేవతలునుగూడ మాటకు ముందు యజ్ఞభాగములు పుచ్చుకొనుము. తిండికి రాము.

అని బెదరింతురు.

సం—ఎందులకు వచ్చిన బెదరింపులు. రాక యేమి సేయుదురు?

తే. దేవతల్ మంత్రముల కధీనులగుదు
రట్టిమంత్రంబు నానోటఁ బట్టియుండ
మంత్రమునఁ బిల్చినను రాకమానఁ దరమె
వేల్పు మంత్రజ్ఞువాకిటి వేఁపిగాఁడె.

నార—అది నీకును నీయాశ్రితులకును జెల్లును. అందఱకుఁ జెల్లునా?

విద్యా—ఏమి? వెఱ్ఱిమాట లాడెదరు. దేవతావిభునిచేతను దేవతాచార్యునిచేతను బలవంతపుబ్రాహ్మణార్థము సేయించెదరా యేమి?

సం—ఆఁ! అలిగినయల్లునిచేత మనుగుడుపులు గుడిపించినట్లు మహేంద్రునిచేతను మహేంద్రునిగురువుచేతను గూడ బలవంతముగా జన్నపుఁగుడుపులు గుడిపించెద.

నార—సంవర్తా! నీ వెంతకైనను సమర్థుఁడవే.

విద్యా—మాగురువు దగ్గఱ లేఁడు గదా యని మీనోటికి వచ్చినట్లు అనుచున్నారా? అనుఁడి! మీరు రేపు స్వర్గమునకు రారా? వచ్చినపుడు దీనికిఁ దగినశాస్తి చేయించెద. వెడలినవెంటనే చెప్పియుంచెదను.

నార—విద్యాధరా! చెప్పవలసిన దంతయు మఱచిపోయెద వేమో కొంగున ముడివేసికో.

సం—మరుత్తమహారాజా!

ఉ. ఈయమరేశ్వరదూత నిఁక నంపుము నాదగుమంత్రశక్తిచే
నాయమరేశుఁడుం దివిజయాజకుఁడుం దివిజాళితోడ య
జ్ఞాయతనంబునం దిడను హవ్యముఁ గైకొనఁ జేయువాఁడ రా
జా! యకుతోభయుండవయి యాగము సేయ నుపక్రమింపుమీ.

మరు—విద్యాధరా! పొమ్ము. (విద్యాధరుఁడు నిష్క్రమించును.)

సం—ఇంక సంకల్పము సేయుటకు సందేహ మేమి?

మరు—సందేహ మేమియు లేదు. సర్వతంత్రస్వతంత్రుఁడ వై సనీ వుపద్రష్టగా నుండ నాకు సందేహ మేల? కాని సంకల్పసమయము నకే స్వర్గాధిపతిసురాచార్యుల రప్పించి సదస్సునఁ గూర్చుండఁబె ట్టితిమా సకలమానవమానససందేహములును దీఱును. దాన స కలలోకంబులు సంతోషించును.

నార—నిజము నిజము! మంచియెత్తు ఎత్తినావయ్యా రాజా!

సం—అది సకలలోకసంతోషకర మగుకార్య మైనపుడు నాశక్తి విని యోగించి చేసెదను. ఇదిగో! ముందు గణపతి యగుబృహస్పతి నావాహ్వానించెద.

నార—"గణానాంత్వా" అనుమంత్రమే కాఁబోలు. వీనిమంత్రములు మనకును వచ్చినవే గాని వాని మాహాత్మ్యము మాత్ర మధికము.

సం—తే. దేవ! గణపతి! నిరుపమ ♦ దివ్యకీర్తి!
శ్రేష్ఠకవిరాజ! బ్రహ్మణ్య! ♦ జ్యేష్ఠరాజ!
మనమరుత్తుఁడు గావించు ♦ మహితయాగ
మందు నర్పించుహావ్యంబు ♦ నందుమయ్య.

మరు—సంవర్తా! బృహస్పతి వచ్చుజాడ గానరాదే!

నార—ఆయనకు సాంసారికబాధలు గొన్ని యున్నవి. ఇంటికి నింటి లోనివారికిఁ గూడఁ గావలి పెట్టి రావలయును. పిలువఁగానే వచ్చు టకు వీలుండదు.

సం—ఆయన కేమయ్యా! త్రిలోకాధినాథునిగురువు. కావలసినంత మంది కావలివాండ్రు. కావలసినంతమంది శిష్యులు.

నార—అదే కొంప ముంచినది. ఏలాగుననో ఈనడుమ శాఁపురమున కొంచెము కుదురుపడిన దని విన్నాను.

సం—మఱొక్కమాఱు మంత్రాహ్వానంబు సేసెదను. (దేవ! గణపతి...చదువును)

మరు—వచ్చుజాడలేదు.

సం—మహేంద్రుఁ డెన్ని మంత్రములతోఁ బిలిచినను తుది "కహల్యాజార" అని పిలిచినఁ గాని రాఁడు. బృహస్పతీ తనకుఁ గూడ నట్టివిశేషాహ్వానము గావలయునని యభిప్రాయపడుచున్నాఁడేమో! కాలానుసారముగఁ గర్మకాండము గూడ మాఱును గదా. నూతన మంత్రము కల్పించి పిలువవలెను గాఁబోలు.

నార—బృహస్పతి మహేంద్రులలో మహేంద్రుఁడే కొంతనయము. మహేంద్రాంతగపురమున క్షేత్రియప్రతిష్ఠలు లేవు.

సం—అట్టివేల? కొండఱకాహ్వానము ముమ్మా ఱుండవలెను. మూఁడవమాఱుకూడ పిలిచి చూచెద. (దేవ! గణపతి!...పఠించును.)

మరు—సంవర్తా! బృహస్పతి దయసేయుచున్నాఁడు.

సం—అమరగురువు నర్హారీతి నాదరింపుము.

నార—మరియాద దక్కించుకొన్నాఁడు.

బృ—(ప్రవేశించుచు) అబ్బబ్బా! మంత్రములు, పగ్గములు వోలె లాఁగికొని వచ్చుచున్నవి. మాబ్రతు కంతయు మంత్రాధీనము. మనుజపోష్యత్వము మాకుఁ దప్పదు. ఏమి సేయుదు. మరియాద యెఱుఁగనివారికి మంత్రము లుపదేశించినఁ గలుగుఫల మిది యే. సాధుబాధ గావింతురు. నాయవస్థయే యిట్లున్నది. ఇతరుల మాట చెప్పవలెనా?

మరు—సురాచార్యా! దయసేయుఁడు. ఏదో నెమ్మదిగా సెలవిచ్చు

చున్నారే? ఏమిసెలవు?

బృ—ఏమియు లేదు. మీవిషయముకాదు.

మరు—చిత్తము. ఈకూర్చికపై దయసేయుఁడు. మహేంద్రుఁడుగూడ దయసేయును.

బృ—ఆమాట నేనే చెప్పవలెనా?

నార—ఈసమయమున నొకమాఱు ఈబృహస్పతిని బలుకరించెద. (నారాయణ నారాయణ అనిపాడుచు దగ్గఱఁగాఁజేరును.)

బృ—(అనిష్టముతో) ఇక్కడకు దయచేసితివా?

నార—మాకేమి? ఎక్కడఁ దలఁచిన నక్కడనే సిద్ధులము. మీవలె మాకు బతిమాలుటలా! బలవంతపెట్టుటలా?

బృ—నారదా! ఎందులకీ వ్యంగ్యపుమాటలు? సమయాసమయములు లేవా? ఎప్పుడును బరిహాసమే? నిన్నుస్మరించినవారి యొద్దకేఁబొమ్ము.

నార—కోపమువచ్చినదా? గృహస్థులుగానమీకుఁ గామక్రోధాదులెక్కువగానుండును. నీవేమన్నను నాకుఁ గోపము లేదు.

మరు—సంవర్తా! గురుచక్రవర్తీ! మహేంద్రునిఁ బరివారసహితముగాఁ నాహ్వానింపుము.

బృ—(తనలో) ఈవెఱ్ఱివాఁడు గురుచక్రవర్తియైనాఁడా?

నార—దేవతాచార్యా! ఏమో యనుచున్నారు.

బృ—ఏమియు లేదయ్యా! నోరు మెదల్చకో నియ్యవా?

నార—ఏమైనను గొప్పవిషయములు సెల విచ్చెద రేమో అని యడిగినాను. అంతగా విసుఁగుకొనెద రేల?

సం— తే. దేవతారాజ! పరివార◆దేవగణము

గొలువ దయసేసి హవ్యంబు◆గొనుము యజ్ఞ

వాటియందు మరుత్తుఁడు ♦ వపల సాజ్య
భాగముల నియ్య నున్నాఁడు ♦ భక్తితోడ.

నార—మహేంద్రుఁడు మహేంద్రపీఠమునుండి కదలలేదు.

సం—మఱియొకమాట వారివిశేషకార్యములు దెల్పుచు నాహ్వానించెద.

నార—నూతనమంత్రకల్పన మక్కఱలేదు. ఇదివఱకే యున్నవి గదా!

సం—అవి యటుండనిమ్ము. అంతకంటె కొంచెము మరియాద నిలఁబెట్టుచుఁ బిలిచెదను. రాకపోయినచో నవి తప్పనే తప్పవు.

నార—కానిమ్ము. అట్టివానికి నూవారు లొంగరు.

సం—

తే. బ్రహ్మహత్యలు గావించి ♦ పాప మొరుల
పాలు గావించి దేవేంద్ర ♦ పదవి నొంది
దేవవేశ్యలయాటలఁ ♦ దేలుచుండు
చెడెనో మరి నీకు మంత్రంబు ♦ చెవులఁ బడదో.

మరు—వచ్చుజాడఁ గానరాదు.

నార—పెద్దమంత్రములతోఁ బదిమందికిఁ దెలియునట్టు పిలువవలయు.

సం—తుది కా మంత్రములు తప్పలేదు.

తే. ఓయి! బ్రిహ్మణ్య! బ్రహ్మణ్య! ♦ రోయియింద్ర!
మేషమగుచు మేధాతిథి ♦ మించువాఁడ!
మేన యనుహానికన్యకు ♦ మిండగీఁడ!
రమ్ము బ్రహ్మణ్య! బ్రిహ్మణ్య! ♦ రమ్మురమ్ము.

నార—అబిడజే రున్నమంత్రమో మంత్రార్థమో రావలయు లేనిచో దిగిరాఁడు.

సం—

తే. విప్రుభార్యను గామించి • వేగుజామ
కోడి వాయుపహల్యాజార! • కుత్సితాత్మ!
యలసినావొకొ రావయ్య • యలపుదీఱ
నాజ్యమిళితంబులౌ వప•లారగింప.

మరు—మహేంద్రుఁడు వచ్చుచున్నాఁడు.

నార—నేను జెప్పలేదా? ఆమెపేరు వినఁబడుట యేతడవు. ఎవరైనఁ బిలి చినను దిగి రావలసినదే. మంచిమాటలతోఁ బిలిచినపుడు రాఁడా గదా?

మరు—అట్లనిపించుకొనుట కొందఱకు సంతోషముకాఁబోలు.

సం—మరుత్తా! అది యొకసంప్రదాయము. తర్వాత సవిస్తరముగాఁ దెలిపెదను. పరిహసింప రాదు, మహేంద్రుని మహాదరముతోఁ బ్రత్యుత్థానము నేసి మహాకూర్చికపైఁ గూర్చుండఁ బెట్టుము.

మరు—చిత్తము. మహేంద్రుని కెదురుగాఁబోవును.

మహేం—(ప్రవేశించి తనలో) మాగురువులకే గతి లేదు. నామాట కేమి? మంత్రపరాధీనత మాకుఁ దప్పదు. ఏదియో యొక పరాధీనత యెవరికిని దప్పదు గదా.

మరు—ఈమహాకూర్చికపై దయచేయుఁడు.

మహేం—(మహాకూర్చికపైఁ గూర్చుండి ప్రక్కకుఁ దిరిగి బృహస్పతి నిఁ బలుకరించును.)

బృ—(ప్రక్కకుఁదిరిగిరహస్యముగా) అక్కడ నారదుఁ డున్నాఁడు. కొంచెము నెమ్మదిగా మాటలాడుము.

మహేం—(నారదునివైపు చూచి మొగముచిట్లించుకొని) ఈతఁడే దీనికిఁ గారకుఁ డఁట. మొదట సంవర్తుని నామహాపేక్షలు మరుత్తుఁ

వ కీర్తిం జే తెల్పెనఁట.

బృ—అయియుండును. ఏకారణమైననేమి? అంతయు వేళముతప్పివచ్చి
నది. నన్నాభిచారికహోమము సేయనిచ్చినావుగావు. కాలహరణము
నియు ఫల మదృష్టరూపమనియు మానిపించినావు. అదే చేసియున్న
చో ఈవెఱ్ఱినిర్భాగ్యులకు మఱు లుండునా? ఇంతవఱకువచ్చునా?

మహేం—సరే గాని, ఇప్పుడు సేయవలసిన దేమి? హవిర్భాగములుం
పుచ్చుకొనుటయే కదా!

బృ—అంతే మఱి తప్పునా.

మహేం—అదికూడ ఎందులకు? మరుత్తుని మంచిమాటలాడి మైత్రి
కుదుర్చుకొని తప్పనితో సకలసామ్రాజ్యాధిపతిపద మిచ్చి పోవు
దము.

బృ—అదే బాగుగా నున్నది. ఈబలవంతపుబ్రాహ్మణార్థ మెందుల
కు? ఏదో యొకవంకతోఁ దప్పుకొనిపోవుట మంచిదే.

నార—(మహేంద్రబృహస్పతులసమీపించి) నేను రావచ్చునా? ఇద్ద
ఱు మాట లాడుచుండఁగా మూఁడవవాఁడు రాగూడ దని నీతిశా
స్త్ర మున్నది. అందులోను మీ రేదియో రహస్యముగా మాట
లాడుకొనుచున్నట్లున్నారు.

మహేం—రావయ్యా! నీయెడ రహస్య మే మున్నది. నీ వెఱుఁగని
దే మున్నది. సంవర్తునియుపద్రష్టృత్వమున మరుత్తుఁడు యాగము
సేయఁదలఁచిగదా మమ్ముఁ బిలిపించినాఁడు. మేము మంత్రరూప
ములఁ గాక నిజరూపములతో వచ్చినాముగదా. ఇంక వేఱే కర్మ
కలాపరూప మగుయాగ మేల? యాగసిద్ధి యయినట్లే సుఫల మి
చ్చిపోఁగూడదా యనుచున్నాను.

నార—అది చాలమంచిదే. సకలలోకసామ్రాజ్యాధిపతి యనుపేరు

మనామమే కాక సకలలోకాధికారముఁ గూడ నిచ్చితివా!

బృ—పెద్దలు చెప్పినది విని యూరకుండక నడుమ లేనిపోనివిషయము లు కల్పించుకొని మాటలాడుట యెందులకయ్యా?

నార—అయ్యో! అదేమన్నమాట. విని మొద్దులాగున నూరకుండు మన్నావా? అట్లయినచో, నాతోఁ జెప్పుట యెందులకు. ఆస్తంభముతోఁ జెప్పరాదా.

బృ—ఏదో యనావశ్యకమగునది పెంచెదవు గదా? ఊరకుండు. అమరుత్తుఁ డేదో యనుచున్నాఁడు. విననిమ్ము.

మరు—దివస్పతి బృహస్పతులారా! మీరు విజయంచేయుటచేత ధన్యుఁడనైతిని. (సంవర్తునిఁ జూపి) ఈమహాత్ముఁడు సర్వతంత్రస్వతంత్రశక్తిగలవాఁడు. ఈతనియనుగ్రహంబుననే భవద్దర్శన మీయాగశాలలో నీరీతిగా నాకు లభించినది.

నార—(తనలో) నామాట యెత్తఁడు గదా (వలదని సంజ్ఞచేయును.)

మహేం—ఈతనిశక్తి నెఱుంగనా? మాకాబాల్యమిత్రుఁడు. కొంతకాలము సహాధ్యాయులము. కారణాంతరమున నంతయు నిట్లు వచ్చినది.

నార—(తనలో) మహేంద్రుఁడు అవసరమును బట్టి మంచిమాట లాడుచున్నాఁడు. నేనొక పుల్ల వేసెదను. (పైకి) ఇతఁ డొకవెఱ్ఱివానివలె నుండెడివాఁడు. అప్పుడు, అన్నదమ్ములలో నేదియో భేదముకలిగి—

సం—నారదా! ఇప్పు డాపప్రసంగమేల? తలపెట్టకుము.

మహేం—నేను చెప్పెడిమాటయు నదే. సంవర్తా! మహేశ్వరానుగ్రహంబున మహాశక్తులు సంపాదించినావఁట. ఎంతమహానుభావుఁడవైతివి. మరుత్తుఁడు మహాదృష్టవంతుఁడు నినుఁబోఁటి యుపద్రష్ట యెవరికి లభించును? మంత్రబలంబున మహాధనరాసులు సంపా

దించి సువర్ణశాలలో సువర్ణ స్తంభపాత్రాదులతో యాగము చేయిం చినవా రేరి? చేసినవా రేరి? లౌకిక వైదికములయం దసమానప్ర జ్ఞ గలుగుటచే, అమాత్యాచార్యపదములు సార్థకములై నీయందగ బడ్డ. బ్రహ్మక్షాత్రబలంబులలో నాశ్రయించినమర్త్యరాజు నమ ర్త్యరాజునుగూడ మించఁ జేసినావు.

నార—అమ్మయ్య! అమాట యొప్పుకొనుచున్నారా? చాలు.

బృ—నారదా! నీవు కొంచెము నేవు మాట లాడకు. శత్రువు లైనను సరే గుణ మున్నవు డొప్పుకొనక యేమి చేసెదరు?

నార—ఆమాటే నేనన్నది. అది యందఱును చెప్పెదరు. కాని అరీతిగా నడచువా రరుదు.

బృ—మాసోదరునికి మొదటనుండియు మహిమలు సంపాదించుటలో నాసక్తి యెక్కువ. తుది కది మంచిపనిలోనే యుపయోగించినది. అదే నాకు సంతోషము.

సం—అగ్రజా! ఇదియంతయు మీయనుగ్రహమే.

నార—ఔను.ఔను. అప్పుడా దాయభాగమే న్యాయముగాఁ బంచిపె ట్టినచో నీవు నొకగృహస్థుగా నుండెడివాఁడవు. ఇట్టి కక్తు లెట్లుసంపా దింపఁగలవు. కావున నన్నగారి యనుగ్రహమే యన వచ్చును.

సం—వా రేమి సేసినను నాకది యుపకారకమే. ఇప్పుడు అది తల పెట్టుట యేల? ఒక్కనిముసము ఆఁగుము. మీరందఱును మరుత్తుఁ డు యాగసంకల్పముసేయ ననుజ్ఞ దయసేయుఁడు.

మహేం—సంవర్తా! మమ్ముఁ గేవలమంత్రాత్ములఁ గాక స్వస్వరూపము లతో రప్పించినావు గదా! క్రియాకలాపయాగములోఁ బని యే మున్నది. పవిత్రయాగమేజరిగినది. పవిత్రఫలమే యిచ్చెద ము. మరుత్తుఁడు సకలసామ్రాజ్యాధికారపదమున సామ్రాజ్యాధిపే

కము గావింపుము.

సం—బృహస్పతి పెద్దవాఁడు. నాకుఁ బిత్రృసముఁడు. దేవతాచార్యుఁడు మీకుగురువు. కావున నాతనిచేతనే మరుత్తునకు సామ్రాజ్యాభిషేకము చేయింపుము.

మహేం—బృహస్పతీ! మీరుభయులునుగూడ మరుత్తునకు సకలలోక సామ్రాజ్యాభిషేకము గావింపుఁడు.

బృ—మహేంద్రా! ఆజ్ఞాప్రకారము గావించెదము.

సం—మరుత్తా! ధన్యుఁడ వైతివి.

మరు—ఇదంతయు మీయనుగ్రహమే కదా! (మహేంద్రునితో) బృహస్పతీ! ధీరత నిన్నుఁ బోలువాఁడను గాను. అని యెఱిఁగియు మొదట నీవజ్రమును దూషించితిని. క్షమింపుము.

మహేం—గతించినదానిని స్మరింప నేల? స్మరింపఁజేయ నేల?

నార—(తనలో) ఆలాగుననే సరిపెట్టుకోవలెను. అగర్వమంతయు నే మైనదో? పైకంటెనా దేవులాడెదరు. వారిమనస్సునకు మాత్రము తెలియదా? కాని మరుత్తుఁడు మంచిమాట యంటించినాఁడు.

మహేం—మరుత్తమహారాజా! మనముభయులము మునుపటికంటె సహస్రగుణాధికంబగు స్నేహములో మెలఁగెదముగాక. ఆంగిరసు లుభయులు మన కమాత్యాచార్యత్వంబుల హితోపదేశము సే యుచుండ నుభయలోకములు సమానాధికారముతోఁ బరిపాలింపఁ జుందుముగాక. అధోలోకమువారి సర్వారీతి నాదరించుచుండ ఎన్నఁటికిని కలహాంకురంబులకుఁ గారణంబు గలుగకుండ జాగ్రత్త కతతో మెలఁగెదము.

నార—ఆఁ! మీరైక్యమా? అది స్వాభావికమా?

బృ—అప్పుడే అష్టపురుష సైచుచున్నావా? బాబూ! బలనిమిత్తము లంగర్త్రి.

మరు—బృహస్పతీ. గురువరా! సంవర్తుండు మీ తనుజుండు తగుటచేత నే నుపదిష్టగాం గోరితిని గాని యితరుల నెవ్వానిను గోరం దలంచికొనలేదు సుమీ.

బృ—నే నెఱుంగనా? నీ కట్టిగురుభక్తి యున్నది గనుకనే యింతమహాపదవి నొందినావు. మీపితామహునియాగమునకు నే నుపదర్శనము చేసినాను. మీపితామహియు మీజనకులును వచ్చినారా?

మరు—చిత్తము. అదిగో! ఆసభలోనున్నారు. ఆప్రక్కవాండౌర్వుండు. ఆవల పాతాళలోకాధిపతి యగువాసుకి. మీదయవలన ముల్లోకములవారును వచ్చియున్నారు.

బృ—సోదరా! సంవర్తా! పంచపల్లవములును పవిత్రనదనదీజలంబులును తీసికొనిరమ్ము.

సం—అగ్రజా! తీసికొని వచ్చుచున్నాను—ఇదిగో గ్రహింపుము.

బృ—(పంచపల్లవములు పవిత్రజలమున ముంచి మరుత్తునితలపైం జల్లంబోవును.)

మహేం—మరుత్తా! నాతో సమానముగ నాసనముశం గూర్చుండుము.

సం—మరుత్తా! మహేంద్రునియాసనమునం గూర్చుండుము.

మరు—(మహేంద్రునిప్రక్కపై సింహాసనమునం గూర్చుండును.)

బృ—అనుజా! సామ్రాజ్యాభిషేకము గావించెదమా? మహేంద్రమరుత్తులారా! యనుజ్ఞ దయసేయుండు. (మహేంద్రమరుత్తులు లేచినిలంబడుదురు. యజ్ఞవాటిలో నందఱు నిలంబడుదురు.)

మరు—(కొంచెముశిరంబువంచి దోసిలియొగ్గి నిలంబడును.)

బృ—పంచభూతములు సాక్షులుగా త్రిభువనమహాజనసమక్షమున మరుత్తమహారాజునకు సకలలోకసామ్రాజ్యపట్టాభిషేకము గావించుచున్నాము. అందఱు నామోదింపుఁడు. సామ్రాజ్యము భౌజ్యము స్వారాజ్యము వైరాజ్యము పారమేష్ఠ్యరాజ్యము మహారాజ్య మాధిపత్య మాసముద్రపర్యంతైకరాడ్భావము సుమహాంగళ్యము సంతతదీర్ఘాయుశ్భాగ్యము సకలలోకసామ్రాజ్యాధికారము సిద్ధించుఁగాక!

సం—తథాస్తు. తథాస్తు.

మహేం—తథాస్తు.

నార—మరుత్తమహేంద్రులారా! మీమైత్రికిని సంవర్తబృహస్పతుల సౌభ్రాత్రమునకును సకలలోకంబులవారు సంతసించుచున్నారు. నాకును బ్రహ్మానందము గలిగినది. సుదినము! సుదినము!

బృ—అదే చాలు. ఇంక నిస్సపత్నముగా నుండవచ్చును. పుష్పవృష్టులు గురియుచున్నవి. రంభాదులు నృత్యము చేయుచున్నారు.

సం—మరుత్తమహారాజా! ధన్యుల మైతిమి. ఈసంతోషసమయమునఁ గొన్ని వరములు గోరుకొనుము. ఇచ్చెదను.

మరు—నాకుఁ గోరవలసిన దేమున్నది? అయినను ఇట్లు కోరెద.

తే. స్వీయధర్మంబు విడువని • శ్రేష్ఠజనులు
సద్గురూక్తుల దాఁటని • సత్యరతులు
చలము బలమును విడువని • శౌర్యధనులు
ప్రబలుదురుగాత భారత • వర్షమందు.

మఱియు,

తే. జాతివిద్వేషములు మాని • శౌర్యధైర్య
సుగుణసంపన్నజనులను • జూచి యోర్చి

మరుత్తరాట్చరిత్ర.

వరులు వన్నెదుఱూయలఁ ◆ బడక యెవ్వరు
మైత్రిఁ జరియింతు రిగాపుత ◆ మహిని బ్రజలు.

[illegible]తశాస్త్ర.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది

శ్రీపాడవంశ పయఃపారావార రాకాసుధాకర
కౌశికసగోత్ర మందేశ్వరశాస్త్రిపుత్త్ర
లక్ష్మీపతిశాస్త్రిప్రణీతం బైన
మరుత్తరాట్చరిత్ర
సంపూర్ణము.

